Photo by T. S. Satyan



బహుమతి
పొందిన వ్యాఖ్య

సాధనమున పనులు...

పంపినవారు :
డి. దేవసహాయం - మోళ్లగుంట

**Statement about ownership of CHANDAMAMA (Telugu)**
**(Rule 8 Form IV), Newspapers (Central) Rules, 1956**

| | | |
|---|---|---|
| 1. *Place of Publication* | : | 'CHANDAMAMA BUILDINGS'<br>2 & 3, Arcot Road,<br>Vadapalani, Madras - 26 |
| 2. *Periodicity of Publication* | : | MONTHLY<br>1st of each Calendar Month |
| 3. *Printer's Name* | : | B. NAGI REDDI,<br>Managing Director,<br>The B. N. K. Press (Pvt) Ltd. |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras-26 |
| 4. *Publisher's Name* | : | B. NAGI REDDI,<br>Managing Proprietor,<br>CHANDAMAMA PUBLICATIONS |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras - 26 |
| 5. *Editor's Name* | : | CHAKRAPANI (A. V. Subba Rao) |
| *Nationality* | : | INDIAN |
| *Address* | : | 2 & 3, Arcot Road, Vadapalani,<br>Madras - 26 |
| 6. *Name & Address of individuals who own the paper* | : | B. NAGI REDDI,<br>Sole Proprietor |

I, B. Nagi Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*28th February, 1957*

**B. NAGI REDDI,**
*Signature of the Publisher*

# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవిగాక ఇంద్రజాలం, చిత్ర కథ, ఫోటో శీర్షికల పోటీ,
వార్తలు - విశేషాలు, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.


ఆకర్షణకు అందచందాలకు...
Remy
SNOW
MADE IN INDIA
రెమిస్నో

విజయ వారి

# మాయా బజార్

డైరెక్షన్.... కె. వి. రెడ్డి, B.Sc. (HONS)





నిర్మాతలు

నాగిరెడ్డి & చక్రపాణి



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

మనకు జీవితంలో ఎందరో ఎన్నోవిధాల సహాయపడతారు. వారికి మనం ఒక్కొక్కప్పుడు తగిన విధంగా ప్రత్యుపకారం చెయ్యలేము. చేయగలిగినస్థితిలో ఉన్నప్పటికీ ప్రత్యుపకారం చేయ యత్నించము. ఉదారబుద్ధి గలవారు తమకు ఇతరులు చేసిన మేలు మరిచిపోరు సరికదా, ఆ మేలుకు తగినవిధంగా ప్రత్యుపకారం చెయ్యటానికికూడా వెనుదీయరు. ఇది వారిలో ఉండే గొప్పతనం.

"దానపాత్రుడు" [జాతక కథ]లో ఒక గ్రామస్థుడు కాశీ రాజుకు ప్రాణదానం చేస్తాడు. పితూరీదార్లతో యుద్ధంచేసి గాయపడిన రాజుకు తన ఇంట ఆశ్రయం ఇస్తాడు. ఆయన రాజని అతనికి తెలియదు; పితూరీదారు కాడని మాత్రమే తెలుసు. గ్రామస్థుడికి ప్రత్యుపకారం చేసే ఉద్దేశంతో రాజు అతన్ని కాశీనగరానికి రమ్మని ఆహ్వానిస్తాడు, కాని గ్రామస్థుడు వెళ్లడు. చివరకు అతను తమ గ్రామం మేలుకోరి మాత్రమే కాశీనగరానికి వెళతాడు. తాను కాపాడినవ్యక్తి రాజేనని తెలుసుకుంటాడు. రాజు తనకు మహోపకారంచేసిన ఆ గ్రామస్థుణ్ణి తన అర్థరాజ్యానికి రాజునుచేసి తన ఔదార్యాన్ని ప్రదర్శిస్తాడు.

సంచిక 3

మార్చి 1957

సంపుటి 20

# తండ్రీ - కొడుకు







# అట్టివీాది బొమ్మ

పంచపాండవులు పన్నెండేళ్ల అరణ్యవాసం పూర్తిచేశారు. ఇప్పుడు వారు పన్నెండు నెలలపాటు ఎవరికీ తెలియకుండా అజ్ఞాతవాసం చేయవలసి ఉన్నది. ధర్మరాజు తన తమ్ములతోబాటు ఆలోచించి, అజ్ఞాతవాసకాలాన్ని మత్స్య దేశంలో విరాటరాజు కొలువులో గడపాలని నిర్ణయించాడు.

"నేను బ్రాహ్మణవేషం ధరించి, కంకుడు అనే పేరు పెట్టుకని విరాటుడి కొలువులో చేరి ఆయనను పాచికల ఆటతో రంజింపజేస్తాను," అన్నాడు ధర్మరాజు. "నేను వలలుడనే పేరు పెట్టుకని విరాటుడివద్ద వంట వాడుగా చేరి, నావంటతోనూ, నాకుగల బలంతోనూ విరాటుడికి ఎల్లవిధాలా సహాయపడతాను." అన్నాడు భీముడు. "నేను జుట్టు ఉంచుకుని, నగలు పెట్టుకని, బృహన్నల అనే పేరుతో, మగవాడూ ఆడపిల్లాని అవతారంలో అంతః పురంలో ప్రవేశించి అంతఃపుర స్త్రీలకు నృత్యం నేర్పుతాను. రాజుగారికీ, రాణీ వాసానికీ నృత్తగీతవాద్యాదులతో వినోదం కలిగిస్తాను!" అన్నాడు అర్జునుడు.

"నాకు అశ్వవిద్య బాగా తెలుసును. నేను దామగ్రంథి అనే పేరుతో విరాటుడి అశ్వశాలలో ఉద్యోగం సంపాదిస్తాను. గుర్రాలకు శిక్షణ ఇవ్వటమూ, జబ్బుచేస్తే చికిత్స చేయటమూ నాకు చేతనవును," అన్నాడు నకులుడు.

"నేను తంత్రిపాలుడని పేరు పెట్టుకుని విరాటుడి గోవులకు పాల కుడనుగా ఉంటాను," అన్నాడు సహదేవుడు. "నేను సైరంధ్రిగా విరాటుడి భార్య అయిన సుధేష్ణదగ్గిర పనికి కుదురుతాను. నాకు తలదువ్వి ముడవటం బాగా తెలుసును. సుధేష్ణ అండను నాకే బాధా ఉండదు," అన్నది ద్రౌపది.

ఈ విధంగా నిర్ణయించుకున్నవారై పాండవులు ధౌమ్యుడికీ, తమ వెంట ఉన్న బ్రాహ్మణులకూ, పరివారానికీ వీడ్కోలు చెప్పి ద్వైతవనంనుంచి ద్రౌపదితోసహా బయలుదేరి మత్స్యదేశానికి వెళ్ళారు. విరాటనగరం అంత దూరంలో ఉండగా వారు ఆగి తమ వేషాలు మార్చుకున్నారు. శ్మశానంలో ఉన్న ఒక శమీవృక్షంమీద తమ ఆయుధాలన్నీ కట్టకట్టి దాచిపెట్టారు. దాని పైన ఒక వికృతమైన శవాన్ని కప్పారు.

తరువాత వారు, తమలో తాము ఒకరినొకరు రహస్యంగా సంబోధించ టానికిగాను జయ, జయంత, విజయ, జయత్సేన, జయద్బల అనే అయిదు పేర్లూ పెట్టుకుని విరాటనగరంకేసి బయలుదేరారు.



# దానపాత్రుడు

ఒకప్పుడు బోధిసత్వుడు కాశీరాజుగా జన్మించాడు. ఆయన పరిపాలించే కాలంలో సరిహద్దున కొందరు పితూరీ జరిపారు. పితూరీదార్లను అణచే నిమిత్తమై రాజుగారు కొంత బలాన్ని వెంటబెట్టుకుని సరిహద్దుకు కదిలి వెళ్ళాడు. అక్కడ యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో రాజుకు గాయం తగిలింది. ఆయన ఎక్కి ఉన్న గుర్రం బెదిరి, యుద్ధరంగంనుంచి పారిపోయింది.

కొద్దిసేపట్లో రాజు గుర్రంతోసహా ఒక సరిహద్దు గ్రామంలోని రచ్చపట్టును చేరుకున్నాడు. ఆ సమయంలో అక్కడ గ్రామంలోని ముప్పై గడపలవారూ చేరి గ్రామ వ్యవహారాలు మాట్లాడుకుంటున్నారు. కత్తీ, డాలూ, కవచమూ ధరించి, యోధుడి వేషంలో రాజు అక్కడ ప్రత్యక్షమయేసరికి, రచ్చపట్టులో చేరినవారంతా భయపడి చెల్లాచెదరుగా పారిపోయారు. ఒక్క గ్రామస్థుడుమాత్రం అక్కడినుంచి కదలలేదు. ఆ గ్రామస్థుడు రాజును సమీపించి, "నీవు పితూరీదారువా? రాజుపక్షం వాడివా?" అని అడిగాడు.

"అయ్యా, నేను రాజుపక్షమే!" అని రాజు జవాబు చెప్పాడు.

ఈ మాట విని గ్రామస్థుడు తృప్తిపడ్డట్టు కనబడి, "అయితే మా యింటికి పోదాం రా!" అని రాజును తన అతిథిగా తీసుకుపోయి, తన భార్యచేత ఆయన కాళ్లు కడిగించి, భోజనం పెట్టించి, అతిథి మర్యాదలన్నీ చేయించాడు. రాజు ఎక్కిన గుర్రానికి ఆ గ్రామస్థుడు తానే స్వయంగా నీరు పెట్టి, దాణా వేశాడు.

రాజు ఆ గ్రామస్థుడి ఇంట నాలుగు రోజులు అతిథిగా ఉండి తనకు కలిగిన గాయాలను మాన్పుకున్నాడు. ఈ లోపలే పితూరీ అణచివేయ బడింది.



రాజు కాశీనగరానికి తిరిగి వెళ్లిపోతూ, గ్రామస్థుడికి తన కృతజ్ఞత తెలుపుకుని, "అయ్యా, నేను కాశీనగరవాసిని, మా ఇల్లు కోట ఆవరణలోనే ఉన్నది. నా కొక భార్యా, ఇద్దరు కుమారులూ ఉన్నారు. మీరు కాశీనగరానికి వచ్చి కుడిచేతి వైపున ఉండే ఉత్తర ద్వారందగ్గిర కాపలావాణ్ణి, 'మహేశ్వారోహుడి ఇల్లెక్కడ?' అని అడిగితే, వాడు మిమ్మల్ని నేరుగా మా ఇంటికి తెస్తాడు. మీరు మీ చిత్తం వచ్చినంత కాలం మా ఇంట అతిథిగా ఉండ వచ్చు!" అని చెప్పాడు.

తరవాత రాజు తన బలాలను చేరుకుని, కాశీనగరానికి తిరిగి వెళ్లిపోయాడు. ఆయన ఉత్తర ద్వారపాలకుణ్ణి పిలిపించి, వాడితో రహస్యంగా, "ఒరే, ఎవరన్నా నీవద్దకు వచ్చి, 'మహేశ్వారోహుడి ఇల్లెక్కడ?' అని అడిగితే ఆ మనిషిని సగౌరవంగా నా దగ్గిరికి తీసుకురా!" అని చెప్పాడు.

ఆ గ్రామస్థుడు వస్తాడని రాజు ఎంతో కాలం ఎదురుచూశాడు, కాని అతను రానేలేదు. అతన్ని ఏ విధంగానైనా తెప్పించాలనే ఉద్దేశంతో, రాజు తన మంత్రులతో చెప్పి ఆ సరిహద్దుగ్రామంమీద కొత్త పన్నులు వేయించాడు.



అప్పటికీ గ్రామస్థుడు రాజువద్దకు రాలేదు. మరికొంతకాలం చూసి రాజు ఆ గ్రామంమీద మరొక పన్ను వేయించాడు. ఈ విధంగా రెండు మూడుసార్లు జరిగాక, ఆ గ్రామంలో ఉండే మిగిలినవాళ్లు గ్రామస్థుడితో, "ఈ పన్నులతో చచ్చి పోతున్నాం. కాశీనగరంలో నీ మిత్రుడున్నాడని చెప్పావు గదా, నీవు వెళ్లి ఆయనను చూసి, పన్నులిచ్చుకోలేక మనం అందరం నానా అగచాట్లూ పడిపోతున్నామని మొరపెట్టి, వీటిని తీసివేయించలేవా?" అన్నారు.

"నా స్నేహితుణ్ణి చూడటం కష్టంకాదు. కాని ఆయన దగ్గిరికి వట్టి చేతులతో ఎలా



వెళ్లేది? అయన కొక భార్య ఉన్నదిట, ఇద్దరు కొడుకులున్నారుట. అందరికీ బట్టలు తీసుకుపోవద్దా? ఆయన భార్యకు కానుకగా నగా నట్రా తీసుకుపోవద్దా? వాటన్నిటినీ సిద్ధం చెయ్యండి, అలాగే బయలు దేరుతాను," అన్నాడు గ్రామస్థుడు.

మిగిలినవాళ్లు బట్టలూ, నగలూ సమకూర్చారు. అవి గ్రామస్థులకు పనికివచ్చే ముతక వస్త్రాలూ, మోటు నగలూనూ. గ్రామస్థుడు తన భార్యచేత రొట్టెలూ, పిండి వంటలూ తయారుచేయించాడు. తాను తీసుకుపోయే వస్తువులన్నీ ఒక మూట కట్టి వెంటతీసుకుని బయలుదేరాడు.

కొంతకాలాని కతను కాశీనగరపు కోట చేరి, కుడివైపున ఉండే ఉత్తరద్వారం సమీపించి, అక్కడి ద్వారపాలకుణ్ణి, "బాబూ, నేను మహాశ్వారోహుడింటికి వెళ్లాలి. దారి ఎటు?" అని అడిగాడు.

తక్షణమే ద్వారపాలకుడు గ్రామస్థుణ్ణి తన వెంటపెట్టుకుని రాజుగారి అంతఃపురానికి తెచ్చి, రాజుగారి ఎదట పెట్టాడు.

అతన్ని చూసి రాజుకు పరమానందమయింది. గ్రామస్థుడు తనకోసం తెచ్చిన తినుబండారాలను ఆయన తన భార్యచేతా, కుమారులచేతా, తన మంత్రి సామంతులచేతా తినిపించి, తానుకూడా



తిన్నాడు. అతను తెచ్చిన ముతక బట్టలను తన భార్యా బిడ్డలచేత కట్టించి, తానుకూడా కట్టుకున్నాడు. తరవాత ఆయన తన అతిథికి మేలైన పట్టుబట్టలు కట్టబెట్టి, తన పాకశాలలో తయారైన భోజనమే అతనికి పెట్టించాడు. తన గ్రామంమీద వేసిన పన్నులు తీయించటానికి అతను వచ్చాడని తెలిసి రాజుగారు ఆ పన్నులను రద్దుచెయ్యవలిసిందిగా మంత్రులకు ఉత్తరు విచ్చాడు.

తరవాత రాజు సభచేశాడు. ఆ సభలో మంత్రి సామంతు లందరి సమక్షాన రాజు ఆ గ్రామస్థుణ్ని తన అర్థరాజ్యానికి రాజుగా ప్రకటించాడు.

ఈ గ్రామస్థుడు వచ్చిన క్షణంనుంచీ రాజుగారు అతనిపట్ల చూపుతూవచ్చిన ఆదరం మంత్రులు మొదలైనవారికి కొంచెం కూడా నచ్చలేదు. అతన్ని అర్థరాజ్యానికి పట్టం కట్టటం వారి దృష్టిలో చాలా అవివేకంగా కనిపించింది.

కాని రాజుగారికి ఎదురుచెప్పటానికి వారికి సాహసం లేకపోయింది. అందుకని వారు రాజకుమారుణ్ణి చేరదీసి, "నాయనా, మహారాజుగారు నీకు చాలా అన్యాయం చేస్తున్నారు. నీకు చెందవలిసిన రాజ్యంలో సగం భాగం నిష్కారణంగా ఈ అనాగరికుడికి కట్టబెడుతున్నారు. ఇందుకుగాను





మహారాజుగారి దగ్గిర ఆక్షేపణ తెలుపుకో వలిసినవాడవు నీవే!" అంటూ ఆ కుర్ర వాడికి బాగా బోధించి పంపారు.

రాజకుమారుడు తండ్రిదగ్గిరికి వెళ్లి, వాళ్లు చెప్పిన ప్రకారం తన ఆక్షేపణ తెలిపాడు.

అంతా విని రాజు, "నాయనా, ఇది నీకు కలిగిన ఆలోచన కాదు. నన్నిప్పు డడిగిన ప్రశ్నే సభలో అడుగు. అప్పుడు నీకు నేను తగువిధంగా సమాధానం చెబు తాను!" అన్నాడు.

రాజకుమారుడు ఆ ప్రకారమే నిండు సభలో తండ్రిని, "ఈ గ్రామస్థుడికి మీరు అర్థరాజ్యం ఇవ్వటానికి కారణమేమిటి?" అని అడిగాడు.

వెంటనే రాజు, "కుమారా, ఈ గ్రామ స్థుడు ఒకప్పుడు నాకు ప్రాణదానం చేశాడు. ఆ సంగతి నీకు తెలియదు," అంటూ సరి హద్దున పితూరీ జరిగిన సమయంలో గ్రామ స్థుడు తనను కాపాడిన వృత్తాంతమంతా వివరంగా చెప్పాడు. ఆ తరవాత ఆయన ఇంకా ఇలా అన్నాడు:

"అపాత్రుడికి దానం చెయ్యటం ఎంత తప్పో, పాత్రుడికి దానం చెయ్యకపోవటం కూడా అంత తప్పే. నేను రాజునని ఎరగ కుండానే ఈ గ్రామస్థుడు నా పట్ల విశ్వాసం చూపాడు. నేను రమ్మని ఆహ్వానించి నప్పటికీ, ప్రత్యుపకారం పొందే ఉద్దేశం ఏ మాత్రమూ లేని కారణంచేత, అతను రానే లేదు. చివరకు గ్రామక్షేమం కోరి మాత్రమే బయలుదేరి వచ్చాడు. నా అర్థ రాజ్యానికి ఇంతకంటె అర్హుడెవరు?"

ఈ మాటలు విని మంత్రి సామంతు లందరూ సిగ్గుపడ్డారు. రాజకుమారుడు తనుచేసిన పొరపాటు గ్రహించాడు. అతడికి తండ్రి మాటలు చాలా సంతోషం కలి గించాయి. ఆ నాటినుండి రాజు తన జీవితాంతంవరకూ ఆ గ్రామస్థుణ్ణి ఎంతో ఆదరంతో చూశాడు.






## 3

[ పింగళుడి సాయంవల్ల, పద్మపాదుడు సరస్సులోంచి, రెండు మొసలి పిల్లలను పట్టుకుని బయటికి వచ్చాడు. తరవాత పింగళుడికి తను ఎవరైందీ చెప్పి, భల్లూకపర్వతాల దగ్గిరకు తనతో రావలసిందిగా అతణ్ణి అడిగాడు. తన తండ్రి గురువైన వృద్ధుడొకడు, మహామాయుడనే మంత్రవేత్తను గురించి చెప్పిన వృత్తాంతం పింగళుడికి చెప్పసాగాడు.]

భల్లూక పర్వతలోయలో ప్రవహించే ఒక నది గర్భాన, ఒక పాడుపడిన దేవళం వుంది. ఆ దేవళంలో మహామాయుడనే గొప్ప మాంత్రికుడు సమాధి అయాడు. అతడు సమాధి అయినచోట ముఖ్యమైన వస్తువులు మూడు వున్నై. ఒకటి: అతడి వేలికి వున్న వుంగరం! దాన్ని ధరించిన వాడికి, భూగర్భంలో వున్న నిధి నిక్షేపాలన్నీ కనబడతై. రెండు: వజ్రాలు తాపిన పిడిగల కత్తి! దానినుంచి వెలువడే అగ్నికణాలు యెటువంటి శత్రువునైనా, నాశనం చేయగలవు. మూడు: బంగారుతో చేయబడిన భూగోళం! ఆ భూగోళాన్ని సంపాయించినవాడు, దాన్ని గుండ్రంగా తిప్పి, తను ఏదేశానికి చక్రవర్తి కావాలని కోరుకున్నా, మరుక్షణం ఆ కోరిక నెరవేరుతుంది.

కాని, మహామాయుడినుంచి వీటిని సంపాయించాలంటే, ముందుగా చిలకసరస్సులో మొసళ్లరూపంలో వున్న అతడి శిష్యులను చేజిక్కించుకోవాలి. ఇందుకు, పింగళుడనే ఒక జాలరి సాయం అవసరమవుతుంది. తరవాత అతడి సాయంవల్లనే,



మహామాయుడినుంచి వుంగరం, కత్తి, భూగోళంకూడా సాధించవచ్చు. ఆ మూడు వస్తువులనూ సాధించినవారికి మాత్రమే మీ తండ్రి విడిచిపోయిన మంత్ర గ్రంథం వుపయోగపడుతుంది.

"మా తండ్రిగారి గురువు, యింతవరకూ చెప్పి, మా ముగ్గురి ముఖాలకేసీ పరీక్షగా చూచాడు. చిలకసరస్సులో మొసళ్ల రూపం ధరించివున్న మహామాయుడి శిష్యులను ముందు చేజిక్కించుకోవాలనేసరికే నాకు, ఒళ్ళు జలదరించింది. మహామంత్రవేత్త అయిన మహామాయుడి శిష్యులతో, అందులోనూ వాళ్ళు మొసళ్ల రూపంలో



నీటి అడుగున వుండగా, పోరాడటం ఎలా సాధ్యమవుతుంది?

"నా తక్కిన సోదరులుకూడా, బహుశా నాలాగే వెలవెలపోయి వుంటారు. గురువు మా ముగ్గురినీ వుద్దేశించినట్టు బిగ్గరగా నవ్వి, 'మహామాయుడి శిష్యులను జయించటంలో, నే చెప్పిన జాలరి పింగళుడు, మీకు చాలా సాయం చేయగలడు. కాని, యీ ప్రయత్నంలో మీరు ప్రాణాలు పోగొట్టుకున్నా పోగొట్టుకోవచ్చు. ముందుగానే హెచ్చరిస్తున్నాను," అన్నాడు.

"మా అన్నదమ్ముల్లో ముందుగా మండనుడు జవాబిచ్చాడు: 'నేను, యిందుకు సిద్ధం. నా తండ్రి వదిలిపోయిన మంత్ర గ్రంథంమీద వున్నతీపి, నాకు నా ప్రాణాల మీదకూడా లేదు," అన్నాడు.

"అతడలా మాట్లాడేసరికి, నాకూ, అనురూపుడికీ కూడా ధైర్యం కలిగింది. మేమూ మహామాయుడి శిష్యులతో పోరాడటానికి సిద్ధమే అన్నాం. అప్పుడు గురువు, మాకు చిలకసరస్సుకు మార్గం చెప్పి, నీచేత కాళ్లూ చేతులూ కట్టించుకుని, సరస్సులో పడిం తరవాత చేయవలసినదంతా వివరించాడు."

"అయితే, నేను చేయవలసిన సాయమేదో చేశాను. ఇప్పుడు, మీవెంట నేను





భల్లూకపర్వతాలకు రావలసిన అవసర మేమిటి?" అని అడిగాడు పింగళుడు.

పద్మపాదుడు ఆ ప్రశ్న విని, కొంచెం సేపు ఆలోచించి, తరవాత పింగళుడి భుజంమీద ఆప్యాయంగా చేయివేస్తూ, "పింగళా! నువ్వు, నన్ను గురించి ఏదో భయపడుతూన్నట్టుంది. నానుంచి నీకు ఎలాంటి హానీ జరగకపోగా, నీకు చాలా గొప్ప మేలు జరుగుతుంది. మహామాయుడు సమాధి అయివున్న పాడుదేవళంలో ప్రవేశించవలసినవాడివి నువ్వు! ఆ పని మరొకరివల్ల కాదు," అన్నాడు.

"నాకు ఎలాంటి హానీ జరగదని మీరు ప్రమాణించేసి హామీయిస్తారా?" అని అడిగాడు పింగళుడు.

పద్మపాదుడు ప్రమాణంచేశాడు. పింగళుడికి ఆ క్షణంలో తల్లి గుర్తుకొచ్చింది. "నేను భల్లూకపర్వతాలనుంచి ఎన్నాళ్లకు తిరిగి రాగలను?" అన్నాడు పింగళుడు.

"రెండు నెలలు; అంతకంటే ఎక్కువ వుండదు. కాని, నువ్వు అక్కడినుంచి తిరిగి యింటికి వెళ్లేప్పుడు, యిలా వుండవు. నిన్ను యీ ప్రపంచంలో అందరికన్నా గొప్ప ధనికుణ్ణి చేస్తానని మాటయిచ్చానుగదా!" అన్నాడు పద్మపాదుడు.



"అప్పటి మాట అలా వుంచండి. ప్రస్తుతానికి నేను, చిల్లిగవ్వకూడా చేతలేని అతి పేదవాణ్ణి. నేను యింటలేని రెండు నెలలూ, నా తల్లీ సోదరులూ బ్రతకటం ఎలా?" అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు గుర్రానికి వేలాడుతున్న ఒక సంచీలోంచి వెయ్యి మొహరీలు తీసి పింగళుడికి యిస్తూ, "ఈ డబ్బు నీ తల్లికి యిచ్చిరా. నీ క్షేమాన్నిగురించి, ఆమె భయపడవలసిందేమీ లేదు. రేపు, యీ వేళప్పుడు, నన్ను యిక్కడే కలుసుకో!" అన్నాడు.

పింగళుడు, పద్మపాదుడిచ్చిన డబ్బు తీసుకుని అమితానందంతో యింటికి



వెళ్లాడు. అతడు వెళ్లేసరికి, యింటిలో అన్నలు లేరు. తల్లి ఒక్కతే అతడికోసరం ఎదురు చూస్తున్నది. పింగళుడు, తను తెచ్చిన వెయ్యి మొహరీలు తల్లిముందు పోశాడు. ఆమె గజగజలాడింది.

"పింగళా! యింత డబ్బు ఎక్కడిది? నాకు భయంగా వుంది," అన్నది తల్లి.

పింగళుడు, జరిగిందంతా తల్లికి చెప్పాడు. తను రెండు నెలలలో క్షేమంగా యింటికి తిరిగి రాగలననీ, భయపడవలసిన అవసరంలేదనీ ధైర్యం కలిగించాడు.

"మాంత్రికుల మంచితనంలో నాకు నమ్మకం లేదు. యీ పద్మపాదుడు అందరి లాంటివాడు కాదని చెపుతున్నావు. దేవుడి దయవల్ల నీకు ఏ కష్టాలు కలగకుండా, భల్లూకపర్వతాలనుంచి సుఖంగా యింటికి తిరిగి రావాలని, ముక్కోటి దేవతలకూ మొక్కుకుంటున్నాను," అన్నది తల్లి.

మరునాడు పద్మపాదుడు చెప్పిన వేళకు, పింగళుడు చిలకసరస్సుదగ్గిరకు వెళ్లాడు. సరస్సు ఒడ్డున, పద్మపాదుడు ఒంటరిగా కూర్చునివున్నాడు. పక్కన ఒక సంచీ తప్ప, గుర్రంగాని మరే వాహనంగాని లేదు.

పింగళుడు, అతణ్ణి సమీపిస్తూనే "పద్మపాదా! మన ప్రయాణం కాలినడకనేనా?" అని అడిగాడు.



"కాలినడకనా? అది అసంభవం. భల్లూకపర్వతాలు చేరాలంటే, మనం రెండు మూడు వందల మైళ్లు ప్రయాణం చేయ వలసి వుంటుంది. ఆ ప్రయాణానికి మామూలు గుర్రాలు పనికిరావు. ఇక రెండు రోజుల్లో ఒక పర్వదినం వస్తుంది. ఆ రోజుకు మనం భల్లూకపర్వతాల దగ్గిర వుండాలి. ఇవిగో మన వాహనాలు!" అంటూ పద్మపాదుడు, చిటికెడు మన్ను తీసుకుని మంత్రించి భూమిమీద చల్లాడు.

మరుక్షణం, పెళపెళా రావాలతో భూమి బద్దలయింది. అందులోనుంచి శిరస్సులు పైకెత్తి కర్ణకఠోరంగా ఓండ్రిస్తూ రెండు గాడిదలు బయటికి దూకినై. పద్మపాదుడు, వాటిలో ఒకదాని వీపుమీద తన దగ్గిరవున్న సంచిని వేలాడకట్టి, దానిమీద ఎక్కి కూచున్నాడు. పింగళుడు భయకంపితుడై, ఏమి చేయాలో తోచక రెండవ గాడిదకేసి చూస్తూ, కదలా మెదలక నిలబడ్డాడు.

"పింగళా, అది నీ వాహనం, త్వరగా ఎక్కికూర్చో. మనం వెళ్లవలసిన ప్రదేశం చాలాదూరంగదా. ఇక బయలుదేరదాం!" అన్నాడు పద్మపాదుడు నవ్వుతూ.

"ఇవి మామూలు గాడిదలు కావు, ఏవో పిశాచాలు! నాకు భయంగా వుంది," అన్నాడు పింగళుడు.





సరిగా చీకటిపడే వేళకు వాళ్లు ఒకానొక అడవిప్రాంతం చేరారు. పద్మపాదుడు ముందుగా గాడిదమీంచి దిగుతూ, "పింగళా! ఈ రాత్రికి యిక్కడ మనం విశ్రాంతి తీసుకుందాం! తక్కిన ప్రయాణం రేపు సాయంత్రం లోపల ముగించవచ్చు," అన్నాడు. బాగా అలిసిపోయివున్న పింగళుడు, అందుకు సరే నన్నాడు.

అక్కడ వున్న పచ్చికమీద కొంచెంసేపు విశ్రాంతి తీసుకున్న తరవాత, పింగళుడికి స్నానం చేయాలనిపించింది. కాని, ఆ ప్రాంతాల ఎక్కడా నీరు వున్న జాడ లేదు అతడు, పద్మపాదుడిని అడిగాడు. పద్మపాదుడు, అడవికేసి చూపుతూ, "అక్కడ, అడవిలో ఒక కొలను వున్నది. నువ్వు ఆ ప్రాంతాల ఎవరిని చూచిగాని భయపడ నవసరం లేదు," అన్నాడు.

"అవి మామూలు గాడిదలు కానిమాట నిజమే. పిశాచాలు అయితేనేం? మనం చెప్పినట్టల్లా నడచుకుంటై. వాయు మనో వేగాలతో ప్రయాణం చేయగలవు. నే వున్నా గదా? నీవు భయపడవలసిందేమీ లేదు," అన్నాడు పద్మపాదుడు.

పద్మపాదుడు యిలా అనేసరికి, పింగళుడికి ధైర్యం కలిగింది. అతడు నిర్భయంగా వెళ్లి గాడిదమీద ఎక్కి కూర్చున్నాడు. మరుక్షణం గాడిదలు రెండూ బిగ్గరగా ఓండ్రపెడుతూ, కొంతసేపు గాలిలోనూ, కొంతసేపు భూమిమీదా దౌడు తీయ సాగినై.

పింగళుడు, అడవికేసి బయలుదేరాడు. పద్మపాదుడు 'ఎవరిని చూచిగాని భయపడ నవసరం లేదు,' అని ఎందు కన్నాడో అతడికి అర్థంకాలేదు. అతడు జాగ్రత్తగా చెట్ల కిందినుంచి నడుస్తూ కొద్దిసేపటికి, ఒక కొలను దాపులకు వెళ్ళాడు. నిర్మలంగా వున్న ఆ కొలనులోని నీరు అతడికి చాలా ఆనందం కలిగించింది. అతడు వుత్సా





హంగా కొలనులోకి దిగబోయాడు. అంతలో, ఆ ప్రదేశమంతా దద్దరిల్లేలా, ఒక భీకర స్వరం వినబడింది. "నన్ను విడిపించండి! మీకు సహాయంచేస్తాను! నన్ను..."

పింగళుడు ఆ స్వరం వింటూనే అదిరి పడ్డాడు. అతడి దృష్టి ఆ ధ్వని వస్తున్న వైపుకు వెళ్లింది. కొలనుగట్టునే, ఒకచోట, రెండు పెద్ద కొండరాళ్లకు గొలుసులతో బంధింపబడిన నల్లని వికృతాకారం అతడికి దృష్టి గోచరమయింది. పింగళుడు బెంబేలు పడి ఒక తృటికాలంలో వెనుదిరిగి పారి పోదామనుకుని, అంతలోనే ఆ వికృతా కారుడు బలమైన గొలుసులతో రాళ్లకు బంధింపబడివున్న సంగతి గుర్తుకు తెచ్చు కుని, వున్న చోటునే వుండిపోయాడు.

"ప్రభూ, స్వామీ! నా చేతులకు వున్న యీ గొలుసులు బద్దలుకొట్టి, నన్ను కాపా డండి. నేను మీకు ఏ సహాయం కావాలన్నా చేస్తాను," అంటూ ఆ వికృతాకారుడు, పింగళుడికేసి తలతిప్పి అరవసాగాడు.

పింగళుడికి అసరికి బాగా ధైర్యం కలి గింది. అతడు అడుగులో అడుగు వేసు కుంటూ, ఆ వికృతాకారుడి దగ్గిరకు వెళ్ళాడు. దగ్గిరలో వుండి చూచినప్పుడు, ఆ వికృతాకారుడు మరీ భయంకరంగా కని పించాడు. తాటిమొదళ్లలా వున్న కాళ్లూ, జడలబర్రెలా వంటినిండా నిక్కబొడిచిన రోమాలూ, ఏనుగుచెవులలాంటి పెద్ద చెవులూ, నిప్పులు చెరిగే కళ్లూ—పింగళుడు భయంతో కంపించిపోయాడు.

"స్వామీ, నన్ను కాపాడండి! మీకు ఎలాంటి సాయమైనా చేయగలను. ఈ మూడు లోకాల్లో ఎక్కడికైనా, మిమ్మల్ని నా భుజస్కంధాలమీద మోసుకుపోగలను," అన్నాడు వికృతాకారుడు.

పింగళుడు, ఆ మాటలకు నవ్వి, "మూడు లోకాలకేకాదు, పధ్నాలుగు లోకాలకూ నన్ను కావాలంటే మోసుకుపోగల



గాడివ నాకొకటి వుంది. నిన్నుచూస్తే, గాడిద కంటె బలమైనవాడివీ, తెలివి గల వాడివీగాకూడా కనబడుతున్నావు. నీ పేరే మిటి ?" అన్నాడు.

"నా పేరు భల్లూక కేతుడు!" అన్నాడు వికృతాకారుడు వినయంగా.

"ఇక్కడకు దాపులనే వున్న భల్లూక పర్వతాల సంగతి నీకు తెలుసా ?" అని అడిగాడు పింగళుడు.

"భల్లూకపర్వతాల సంగతా ?" అంటూ భల్లూక కేతుడు వికృతంగా నవ్వి, "నేను ఒకప్పుడు ఆ భల్లూకపర్వతాలకు అధిపతిని. ఒక మాంత్రికుడి మూలంగా, నాకీ దురవస్థ పట్టింది. మీరు నన్ను బంధవిముక్తుణ్ని చేస్తే, ఆ పర్వతాల్లో వున్న సర్వసంపదలూ మీవిగా చేస్తాను," అన్నాడు భల్లూక కేతుడు.

భల్లూక కేతుడు అలా అనేసరికి, పింగళుడికి ఎక్కడలేని ఆశా కలిగింది. భల్లూక కేతుడి సాయంతో, తను భల్లూకపర్వతాల్లో వున్న నిధినిక్షేపాలన్నీ వశపరచుకోవచ్చు ననుకున్నాడు. కావాలంటే, అందులో పద్మపాదుడికికూడా పాలు పంచవచ్చు.

"అయితే, నిన్ను యీ గొలుసులనుంచి విముక్తుణ్ని చేస్తాను. కాని, ఆ తరవాత నాకు హాని చేయవని నమ్మకమేమిటి ?" అని ప్రశ్నించాడు పింగళుడు.

భల్లూకకేతుడు ఆశగా పింగళుడికేసి చూస్తూ, "స్వామీ, అడినమాట తప్పితే, తల పగిలిపోతుందని, నాకు శాపం వుంది. మీకు హాని చేయనని మాటయిచ్చాంతరవాత, చావదలిస్తే తప్ప, లేకపోతే అందుకు భిన్నంగా ప్రవర్తించలేను," అన్నాడు.

పింగళుడికి, భల్లూకకేతుడి మాటల్లో నమ్మకం కలిగింది. అతడు కొలను ఒడ్డునే వున్న ఒకరాయి తీసుకుని, ముందుకు వెళ్ల బోయాడు. ఇంతలో వెనకనుంచి పద్మ పాదుడు, "పింగళా! ఆగు!" అంటూ బిగ్గరగా కేక వేశాడు. (ఇంకా వుంది)



# ప్రాణం పొందిన ప్రతిమ

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, శవాన్ని చెట్టునుంచి దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి బయలుదేరాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు కీర్తి కోసమై ఇంత తంటాలుపడుతున్నావుగాని, ఈ జీవితంలో కీర్తికంటె ఆనందమే ముఖ్యమైనది. వెనకటికి మయుడు ఏంచేశాడో ఎరగవా? నీకు అతని విచిత్రకథ చెబుతాను విను!" అంటూ ఈవిధంగా చెప్పసాగాడు:

దేవతల శిల్పి విశ్వకర్మ. రాక్షసుల శిల్పి మయుడు. ఇద్దరూ గొప్ప శిల్పులే; కాని ఇద్దరిలోనూ మయుడు చాలామెరుగు. అయితే అతను రాక్షసుల శిల్పి కావటంచేత అతన్ని దేవతలు ఎన్నడూ మెచ్చేవారుకారు; విశ్వకర్మే గొప్ప శిల్పి అని చెప్పుకునే వారు.

మయుడు శిల్పంలో ఎంత గొప్పవాడో అతని స్వభావంకూడా అంత మంచిది.

## బేతాళ కథలు



"విశ్వకర్మమాత్రం సామాన్యుడా? స్వర్గమంతా అతనే కట్టాడు. సూర్యుణ్ణి సానబట్టి, అప్పుడు వచ్చిన చూర్ణంతో మహా విష్ణువుకు చక్రం చేసిపెట్టాడు. పాండవులకు ఇంద్రప్రస్థం కట్టిపెట్టాడు. ఇప్పుడా పాత విషయాలన్నీ తవ్వటం అనవసరం. నీకూ, విశ్వకర్మకూ పోటీ ఏర్పాటు చేస్తాం. ఆ పోటీలో నీవు విశ్వకర్మను ఓడించాలి! అప్పుడు, నీఘనతను అందరూ గుర్తిస్తారు," అని రాక్షసులు మయుణ్ణి ఒత్తిడిచేశారు.

"సరే, పోటీ ఏర్పాటు చెయ్యండి," అన్నాడు మయుడు.

తనను దేవతలు మెచ్చుకోలేదని అతను బాధపడేవాడుకాడు. కాని మిగిలిన రాక్షసులు, మయుడి దగ్గిరికి వెళ్ళి, "నీకామాత్రం పౌరుషమైనా లేదేం? విశ్వకర్మ నీ కాలి గోరికైనా సమంకాడుగదా, అలాటి విశ్వకర్మ నీ కన్న గొప్ప శిల్పి అంటె చూస్తూ ఊరుకుంటావా?" అన్నారు.

మయుడు నవ్వి, "నేను ఎటువంటి శిల్పినో దేవతలు ఎరగరా? శివుడు ఆజ్ఞాపించగా సాల్వుడికోసం గాలిలో ఎగిరే సౌభక నగరం నిర్మించలేదా? పాండవులకోసం నేను నిర్మించిన సభను అందరూ చూచారు గదా?" అన్నాడు.

రాక్షసులు దేవతలవద్దకు వెళ్ళి, "మీ విశ్వకర్మకూ, మా మయుడికీ పోటీ ఏర్పాటు చెయ్యండి. ఇద్దరిలో ఎవరు గొప్ప శిల్పి అయిందీ తేలిపోతుంది. మాటలతో పని ఏమిటి?" అని అడిగారు.

దేవతలు తమలోతాము గుసగుసలాడుకుని విశ్వకర్మతో ఈమాట చెప్పారు.

"బృహస్పతికి బావమరిదిని, సూర్యుడికి పిల్లనిచ్చిన మామను! ఈ రాక్షస శిల్పితో పోటీకి వెరుస్తానా?" అన్నాడు విశ్వకర్మ.

దేవతలు మయుణ్ణి పిలిపించి, "నీకూ విశ్వకర్మకూ పోటీ ఏర్పాటు చేస్తున్నాం. నువు ఎటువంటి మహత్తుగల వస్తువు నిర్మి

స్తావే చెప్పు. అటువంటిదే విశ్వకర్మనుకూడా నిర్మించ మంటాం!" అన్నారు.

"మహిమల కేమిటి? అందరి మహిమలూ అందరెరిగినవే. నేను మూడు లోకాలలోనూ లేని సుందరిని బంగారు ప్రతిమగా తయారు చేద్దామనుకుంటున్నాను. నా శిల్పంలోని సౌందర్యాన్ని అంచనా వెయ్యటానికి, వారూ వీరెందుకు? సృష్టికర్త అయిన బ్రహ్మనే ఏర్పాటు చేయండి!" అన్నాడు మయుడు.

దేవతలు ఇందుకు సంతోషంతో ఒప్పుకుని, వెళ్ళిపోయారు.



త్వరలోనే మయుడు ఒక అద్భుతమైన స్త్రీ రూపాన్ని మనిషి ప్రమాణంగల బంగారు విగ్రహంగా నిర్మించాడు. దేవతలంతా వచ్చి ఆ విగ్రహాన్ని చూసి నివ్వెరపోయారు.

విశ్వకర్మకు కాలూ, చెయ్యీ ఆడలేదు. ఆయన బ్రహ్మదేవుడివద్దకు వెళ్ళి, "తాతా, ఈ మయుడు నీకు చాలాపెద్ద అవమానం చేస్తున్నాడు. మూడు లోకాలలోనూ ఎక్కడాలేని సౌందర్యవతిని సృష్టించాడు. సృష్టికర్తవైన నీవుకూడా అటువంటి సుందరిని ఎన్నడూ సృష్టించలేదని రుజువు చెయ్యటానికే అతను ఈపని చేశాడు. ఆ విగ్రహం ప్రపంచంలో ఉన్నంతకాలమూ మయుడి కీర్తి శాశ్వతంగా ఉండిపోతుంది. అంతకాలమూ నీకూ, నాకూకూడా అపకీర్తి తప్పదు!" అన్నాడు.

మిగిలిన దేవతలుకూడా బ్రహ్మదగ్గిరికి వెళ్ళి, "తాతగారూ, మీరే ఎలాగైనా ఈ పోటీకి విఘాతం కలిగించాలి. లేకపోతే మన విశ్వకర్మకు అపకీర్తీ, అపజయమూ తప్పవు!" అని వేడుకున్నారు.

మయుడు సృష్టించిన హేమవిగ్రహాన్ని చూడటానికి బ్రహ్మదేవుడే స్వయంగా బయలుదేరి వచ్చాడు. దేవతలు చెప్పిన మాటలలో అతిశయోక్తి ఏమీ లేదని బ్రహ్మకుకూడా తోచింది.

ఆయన మయుడితో, "నాయనా, నీవు కుర్రవాడవయినా ఈ హేమవిగ్రహాన్ని అత్యద్భుతంగా నిర్మించావు. కాని నాకు ఒక్కటే విచారంగా ఉన్నది. ఏమిటంటే, నేనెన్నడూ ప్రాణంలేని ప్రతిమలను సృష్టించినవాణ్ణికాను. ఈ ప్రతిమను చూస్తుంటే, దీనికి ప్రాణం ఉంటే ఇంకా ఎంత బాగుండునని నాకే అనిపిస్తున్నది. విశ్వకర్మకన్న గొప్ప శిల్పి వనిపించుకోవటానికి ఈ విగ్రహాన్ని ఎందుకు వృథా చేస్తావు? నేను దీనికి ప్రాణంపోస్తాను. ఇది నీకు యావజ్జీవం భార్యగా ఉంటుంది. అంతకన్న కావలిసినదేమిటి?" అన్నాడు.

మయుడు కొంచెంసేపు ఆలోచించి, "దేవా, అలాగే చెయ్యండి. నేను విశ్వకర్మకు ఓడినట్టు ఒప్పుకుంటాను!" అన్నాడు. దేవతల ఆనందానికి మేరలేదు. బ్రహ్మదేవుడు హేమవిగ్రహానికి ప్రాణంపోసి, మనిషినిచేసి, ఆమెకు 'హేమ' అని నామకరణంకూడా చేశాడు. అప్పటి కప్పుడే మయుడికీ, హేమకూ వివాహం అయిపోయింది. బ్రహ్మదేవుడూ మిగిలిన దేవతలూ వెళ్లిపోయారు.

"ఇక మీదట హేమ సౌందర్యంగురించి మీరు చింతించ నవసరంలేదు. ఆమెకు శరీరధర్మాలన్నీ ఏర్పడ్డాయి. కాలక్రమాన



ఆమెకు పిల్లలు పుడతారు, జబ్బులు చేస్తాయి, ముసలితనం వస్తుంది, చివరకు చచ్చిపోతుంది. మయుడి శిల్పం ఈ విధంగా మట్టిలో కలిసిపోతుంది!" అని బ్రహ్మ దేవతలతో అన్నాడు.

ఆయన అన్నట్టుగానే అక్షరాలా జరిగింది. హేమ కొంతకాలం మయుడితో కాపరంచేసి, మండోదరీ, మాయావీ, దుందుభీ అనే పిల్లలను కన్నది. ఆమె శరీరం వయసుతో ముడతలుకూడా పడనారంభించింది. ఒకప్పుడు హేమ సౌందర్యాన్నిగురించి గొప్పగా చెప్పుకున్న రాక్షసులే ఆమెను గురించి చెప్పుకోవటం మానేశారు.

ఇంతలో దేవతలువచ్చి మయుడితో పోట్లాట పెట్టుకున్నారు. "హేమ మా అడబడుచు. మాలోకంలో ఉన్నట్టయితే శరీర ధర్మాలకు అతీతంగా ఉండి, నిత్య యౌవనిగా ఉండేది. నీకు భార్య కావటంచేత అందవికారంగా అయిపోయింది, చూడు!" అంటూ వారామెను తీసుకుని వెళ్లిపోయారు.

మయుడు విరక్తిచెంది తన పిల్లలను వెంట వేసుకుని దేశాటనచేస్తూ తిరిగాడు. ఇలా తిరుగుతూన్న సమయంలోనే అతనికి రావణుడు కనిపించాడు. అతనికి మయుడు తన కుమార్తెను మండోదరినిచ్చి పెళ్లి చేశాడు. ఆ కథ అంతా నీకు తెలిసినదేకదా!



బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకొక సందేహం కలిగింది. మయుడు సాటిలేని శిల్పి అయిఉండికూడా, విశ్వకర్మను పోటీలో ఎందుకు ఓడించి శాశ్వతకీర్తి సంపాదించుకోలేదు? తన విగ్రహంలో శాశ్వతంగా నిలిచి పోవలిసిన సౌందర్యాన్ని క్షణికమైన సౌందర్యంగా బ్రహ్మ మార్చుతానంటే ఎందుకు సమ్మతించాడు? కీర్తికాంక్ష లేకనా? అటువంటి అందగత్తె తనకు భార్య అయితే అంతేచాలుననా? దీనికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది!" అన్నాడు.

దానికి విక్రమార్కుడు నవ్వి, బేతాళుడికి ఈవిధంగా జవాబు చెప్పాడు.

"బ్రహ్మదేవుడు హేమకు ప్రాణం ఇచ్చినప్పుడే మయుడు విజయం సాధించాడు. ఎందుచేతనంటే, మనిషి చేసిన శిల్పాలకు అంతకు పూర్వంగాని, ఆ తరవాతగాని బ్రహ్మదేవుడు ప్రాణంపొయ్యటం జరగలేదు. అదీగాక, శిల్పంలో ఉండే సౌందర్యం శాశ్వతమైన దనుకోవటం చాలా పొరపాటు. విశ్వకర్మ నిర్మించిన నగరాలూ, మయుడు నిర్మించిన నగరాలూ ఇప్పుడున్నాయా? అవి ఏనాడో నశించిపోయాయి. కాని సౌందర్యం నశింపులేనిది. మయుడు చేసిన హేమవిగ్రహానికి ప్రాణంపోసి, బ్రహ్మదేవుడే ఆ విగ్రహంలో ఉండే సౌందర్యాన్ని శాశ్వతంగా చేశాడు. ఎందు కంటావా? హేమలో ఉండిన సౌందర్యం మండోదరికి వచ్చింది. ఆమెనుకూడా త్రిలోకసుందరి అన్నారు. ఈ నాటికికూడా ప్రతి సౌందర్యవతిలోనూ హేమసౌందర్యం ఉండనే ఉన్నది. ప్రపంచం ఉన్నంతకాలమూ అది నశించదు! ఇది తెలుసు గనకనే మయుడు బ్రహ్మ సలహాను ఆమోదించాడు."

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. (కల్పితం)





# రేజరు బ్లేడుతో మరికొన్ని బొమ్మలు:

చిత్రకారుడు :

కె. ఎం. ముకుందరావు - బొలారం.

[వీరి బొమ్మలను లోగడ నవంబరు '56 సంచికలో ప్రచురించియున్నాము.]











# కుచుమారుడు

పూర్వం కాశీనగరంలో కుచుమారుడనే బ్రాహ్మణ యువకు డొకడుండేవాడు. అతను అరవైనాలుగు విద్యలలోనూ గొప్ప పాండిత్యం సంపాదించాడు. ఆ కాలంలో ధారానగరాన్ని పరిపాలించే భోజరాజు ఎక్కడెక్కడి పండితులనూ ఆదరించి, గొప్పగా సత్కరిస్తూ ఉండేవాడు. అందుచేత కుచుమారుడు భోజసభకు వెళ్లి సన్మానం పొందే ఉద్దేశంతో ధారానగరానికి కాలి నడకను బయలుదేరాడు.

పోగా పోగా అతనికి ఒక బ్రాహ్మణ అగ్రహారం తగిలింది. అక్కడ అతను ఒక బ్రాహ్మడి ఇంట అతిథిగా ఉన్నాడు. భోజనాలు చేసే సమయంలో గృహస్థు కుచుమారుడితో, "అయ్యా, తమరు ఎక్కడి నుండి వస్తున్నారు? ఎక్కడికి పోతున్నారు? ఏం పనిమీద వెళుతున్నారు?" అని ఆప్యాయంగా అడిగాడు.

"మాది కాశీనగరం. సన్మానం పొందటానికి భోజరాజు ఆస్థానానికి వెళుతున్నాను. ఆయన గొప్ప దాతగదా! నేను అన్ని శాస్త్రాలూ చదివిన పండితుణ్ణి," అని కుచుమారుడు సమాధానం చెప్పాడు.

ఆ మాట విని గృహస్థు, "మీరు నిజంగా పండితులే అయితే, కష్టపడి ధారానగరానికి వెళ్లటం దేనికి? భోజరాజు ఎంత ఇచ్చినా అగ్రహారాలు ఇవ్వడుగదా! మా మహారాజుకు సరస్వతి అని ఒక్కతే కూతురున్నది. ఆమెకూడా అన్ని శాస్త్రాలూ చదివినది. పాండిత్యంలో తనతో సమానుడైనవాణ్ణే పెళ్లాడతానని పట్టుపట్టి ఉన్నది. ఆమె పరీక్షకు నెగ్గినవాడికి సరస్వతి నిచ్చి పెళ్లి చెయ్యడమే గాక రాజ్యాభిషేకంకూడా చేస్తారు. దేశదేశాలనుండీ పండితులు తండోపతండాలుగా వస్తున్నారు. ఒక్కొక్కరే పరీక్షలో ఓడిపోతున్నారు," అని చెప్పాడు.

ఆర్. వెంకటాచారి

రాజకుమార్తె చేసే పరీక్షకు కుచుమారుడు నిలబడతా నన్నాడు. రాజధాని అయిన పురందరపురం అగ్రహారానికి కొద్ది దూరంలోనే ఉన్నది. గృహస్థు తన కొడుకును, శంబరుడనేవాణ్ణి కుచుమారుడి వెంట తోడుగా పంపాడు. ఇద్దరూ కలిసి రాజధానికి వెళ్ళారు.

కుచుమారుడు ఆస్థానానికి వెళ్లి తన కులమూ, గోత్రమూ, పేరూ తెలుపుకుని, తాను సరస్వతిని పెళ్ళాడ వచ్చినట్టు చెప్పుకున్నాడు. అధికారులు అతనికి ఒక విడిది చూపించి, అతనికి సంబంధించిన వివరాలు రాజకుమార్తెకు పంపారు.

రాజకుమార్తె కుచుమారుడికి ఈ విధంగా లేఖ పంపింది; "అయ్యా, మీరు బ్రాహ్మణులు. మిమ్మల్ని ఓడించటం నా కిష్టంలేదు. అందుచేత మీకు కొన్ని బహుమానాలు పంపుతున్నాను, వాటిని తీసుకుని నన్ను ఆశీర్వదించి వెళ్లిపొండి."

ఈ లేఖ తెచ్చిన నౌకర్లే బహుమానాలు కూడా తెచ్చారు. కుచుమారుడు వాటిని తీసుకోక, శంబరుడిచేత ఈ విధంగా జవాబు రాయించాడు; "నన్ను పెళ్ళాడటం ఇష్టం లేకపోతే ఆమాటే చెప్పవచ్చు; ఈ విధంగా సాగనంప నవసరంలేదు. నన్ను ఓడించిన




పక్షంలో ఏ కానుకలూ అవసరం లేకుండా, నా దోవన నేనే పోతాను."

ఈ జవాబు చూసుకుని సరస్వతికి రోషం వచ్చింది. ఆమె తన భటుల ద్వారా ఒక పళ్లెంలో పెట్టి రకరకాల పూలు పంపింది. పూలమాలలు కట్టే విద్యలో తనను పరీక్షించటానికి రాజకుమార్తె ఈ పూలు పంపిందని గ్రహించి, వాటితో రకరకాల మాలలు కట్టి, వాటిని తన పేరు వచ్చేలాగ అమర్చి, కుచుమారుడు తిప్పి పంపాడు.

ఆ తరవాత రాజకుమార్తె అతనివద్దకు కొన్ని నిజమైన రత్నాలనూ, మరికొన్ని నకలు రత్నాలను కలిపి, వాటికి విలవ కట్ట

మని పంపింది. కుచుమారుడు నిజమైన రత్నాలన్నిటికీ విలవకట్టి, నకలు రత్నాలను చితకగొట్టి ఆ పొడితోసహా ఆమెకు తిప్పి పంపేశాడు.

ఆ తరవాత రాజకుమార్తెవద్ద ఉండే పరిచారికలు మాటలురాని చిలకను తెచ్చి, "దీనికి మాట్లాడటం నేర్పమని రాజకుమార్తె పంపింది," అని చెప్పారు.

చిలకలకు మాటలు నేర్పటంకూడా ఒక విద్యే. ఆ విద్యకూడా కుచుమారుడికి తెలుసు. అతను మర్నాటికల్లా చిలకకు మాటలు నేర్పి పరిచారికలద్వారా దానిని రాజకుమార్తెవద్దకు పంపాడు.

అప్పటివరకు రాజకుమార్తె కుచుమారుణ్ణి చూసి ఉండలేదు. ఇప్పుడామెకు అతన్ని గురించి తెలుసుకోవాలని అనిపించింది. ఆమె చిలకను అడిగి అతను చాలా అందగాడనీ, చిన్నప్రాయంవాడేననీ తెలుసుకున్నది. అతనిని పెళ్ళాడటానికి నిశ్చయించుకున్నది కూడా.

సరస్వతి కుచుమారుణ్ణి తన భర్తగా ఎన్నుకున్నదన్న వార్త రాచనగరు అంతటా పాకింది. ఈ విషయం శంబరుడికికూడా తెలిసింది. ఎందుకంటే రాజకుమార్తె తన చిలకద్వారా కుచుమారుడికి ఒక మణిహారం బహుమానంగా పంపింది.



శంబరుడికి దుర్బుద్ధి కలిగింది. తమ ఇద్దరిలో కుచుమారు డెవరో ఎరిగినవా రెవ్వరు? రాజకుమార్తె కుచుమారుణ్ణి ఇంతవరకు చూడలేదు. ఇక ఆమె అతన్ని పరీక్షించదు. అతణ్ణి చంపివేసి, తానే కుచుమారుణ్ణని చెప్పుకుని రాజకుమార్తెను పెళ్లాడవచ్చు, రాజుకూడా కావచ్చు.

ఈ దురాశతో శంబరుడు ఆ రాత్రి కుచుమారుడు నిద్రపోయేవేళ ఒక పెద్దరాయితో అతని తలమీదకొట్టి, మెడకు ఆరాయే కట్టి, అతన్ని తీసుకుపోయి కోటవెలపల ఉన్న అగడ్తలో పారేశాడు. కుచుమారుడి మెడలోని మణిహారం తాను వేసుకున్నాడు.

అయితే శంబరుడికి కొత్త చిక్కొకటి వచ్చిపడింది. తెల్లవారుతూనే సరస్వతి తన ప్రియుడికి చిలకద్వారా ఒక సందేశం పంపింది. అది వచ్చి కుచుమారుడికోసం విడిది అంతా వెతికి, శంబరుడితో, "కుచుమారు డెక్కడ?" అన్నది.

"నేనే కుచుమారుణ్ణి! నాతో ఏం పని?" అని శంబరుడు అడిగాడు.

"నువు కుచుమారుడి వెందుకయింది? ఆయన ఎక్కడో చెప్పు! రాజకుమార్తె కబురు చెప్పమన్నది!" అన్నది చిలక.

"ఇలా రా, చెబుతాను", అని శంబరుడు, చిలక దగ్గిరికి రాగానే దాని గొంతు





పట్టుకుని, "నాకా కబురు చెబుతావా ? చంపనా ?" అన్నాడు. ఎంత బెదిరించినా చిలక మాట్లాడలేదు. కోపంవచ్చి శంబరుడు చిలకను చంపేశాడు.

తాను పంపిన చిలక ఎంతకూ రాక పోయేసరికి రాజకుమార్తె సరస్వతి ఆందోళన పడింది. కుచుమారుడి సమాధానం కోసంకూడా ఆమె ఆత్రంగా ఎదురుచూస్తున్నది. చివర కామె తన దాసీలను పంపింది. వారు వచ్చి శంబరుడితో, "కుచుమారుడుగా రెవరు ?" అన్నారు.

"నేనే కుచుమారుణ్ణి," అన్నాడు శంబరుడు ధీమాగా.

"మా రాజకుమార్తె మీవద్దకు చిలకను పంపిందే, అది ఏమయింది ?" అని దాసీలు ఆత్రంగా అడిగారు.

"కర్మంచాలక ఒక గండుపిల్లి ఆ చిలకను పట్టుకున్నది !" అన్నాడు శంబరుడు, ఎంతో విచారం కనబరుస్తూ.

దాసీలు సరస్వతివద్దకు తిరిగిపోయి, "అమ్మా, విడిదిలో మా కెవరో కనిపించి తానే కుచుమారుణ్ణని చెప్పాడు. మన చిలకను పిల్లి పట్టుకున్నదని అన్నాడు. మనిషి చాలా వికారంగా ఉన్నాడు. పండితుడి లక్షణాలే లేవు! మాకంతా అనుమానంగా ఉంది !" అన్నారు.

కుచుమారుడు చాలా అందగాడని చిలక అదివరకే చెప్పింది. రాజకుమార్తెకుకూడా అనుమానం తగిలింది. ఏమైనా నిజం తెలుసుకునేటందుకని ఆమె ఆందరికీ తెలియని లిపిలో ఒక శ్లోకం రాసి దాసీల చేతి కిచ్చి, "దీనికి సమాధానం తీసుకురండి !" అని పంపింది.

ఆ శ్లోకం శంబరుడు చాలాసేపు ప్రయత్నించి, చదవలేక మండిపడ్డాడు.

"చీటికీ మాటికీ మీ రాజకుమార్తె నన్ను పరీక్షించటం ఏమీ బాగాలేదు. నేను సమాధానం చెప్పను !" అన్నా డతను.

" మీకుతప్ప ఇంకెవ్వరికీ తెలియకుండా ఉండగలందులకు మా రాజకుమార్తెగారు మారుమూల లిపి రాశారు. అంతేగాని, ఇది పరీక్ష ఏమాత్రం కాదు. దయచేసి త్వరగా సమాధానం రాయండి. కావలిస్తే మీరుకూడా ఇంకొక మారుమూల లిపిలో రాయండి!" అన్నారు దాసీలు.

"నేను రాయను. ఇది పరీక్షే! నేను కుచుమారుణ్ణి కానని మీ రాజకుమార్తెకు అనుమానం కలిగితే, ఇదుగో ఆమె నాకు లోగడ పంపిన మణిహారం!" అన్నాడు శంబరుడు ఎంతో కోపంగా.



ఈ మాటతో దాసీల అనుమానం ధృఢి అయింది. అతను కుచుమారుడు కాడని ఎవరూ అనలేదు. అతనే పుచ్చకాయల దొంగంటే భుజాలు తడువుకున్నట్టు ప్రవర్తించాడు. వాళ్ళు వెళ్లిపోయారు.

దాసీలకు తోచినట్టే రాజకుమార్తెకు కూడా తోచింది. ఆమె అతనికి ఇంకొక పరీక్ష పెట్టింది: తన దాసీలకు మాటలు రాని ఇంకొక చిలకనిచ్చి పంపింది. వారు శంబరుడివద్దకు వచ్చి, "అయ్యా, మీరు మాటలు నేర్పిన చిలక పోయినాక మీతో ఉత్తరప్రత్యుత్తరాలు చేయటానికి మార్గం లేకుండా ఉంది. కొత్త లిపిలో రాస్తే మీరు సమాధాన మివ్వకుండా ఉన్నారు. కనీసం ఈ చిలకకు మాటలు నేర్పండి; ఇది మీ మధ్య రాయబారిగా ఉంటుంది!" అన్నారు.

"నా కిదే పనా? నేను ఈ చిలకకు మాటలు నేర్పను. నన్ను పెళ్లాడటం ఇష్టంలేక మీ యజమానురాలు ఇవన్నీ కల్పిస్తున్నది లాగుంది!" అన్నాడు శంబరుడు. అతను ఈ మాట అనటంతో సరస్వతికూడా శంబరుడి మోసం సంగతి పూర్తిగా తెలుసుకున్నది.

ఈ లోపల ఒక వింత జరిగింది.

రాజధానికి సమీపంలోనే ఒక బెస్తవాళ్ల గ్రామం ఉన్నది. వాళ్లు ఒక కొత్త వల

తయారుచేసి, దాన్ని ఉపయోగించటానికి ముహూర్తం పెట్టమని తమ పురోహితుణ్ణి అడిగారు. ఆయన మీన మేషాలన్నీ లెక్క పెట్టి, "ఇవాళ అర్ధరాత్రివేళ దివ్యంగా ఉన్నది!" అన్నాడు.

అర్ధరాత్రివేళ వల వెయ్యటానికి నదికి వెళ్లటం కుదరదు. అదీగాక రాజుగారి కోట వెలపల ఉండే అగడ్తలోకి కొత్తనీరు వచ్చినట్టు వారికి తెలిసింది. అందుచేత వాళ్లు ముహూర్తంవేళకు అగడ్తవద్దకు వెళ్లి అక్కడ వల వేశారు. వల లాగేటప్పుడు బెస్తలకు చాలా బరువు తోచింది. వలలో చాలా చేపలు పడ్డాయని వారు ఆశపడ్డారు.

కాని తీరా వల లాగిచూస్తే అందులో ఒక మనిషి శరీరం కనిపించింది. మొదట అది శవమేనని బెస్తలు అనుకున్నారుగాని పరీక్షించినమీదట ఆ మనిషి శరీరం వెచ్చగానే ఉన్నది. గుండె ఇంకా అడుతూనే ఉన్నది.

అది కుచుమారుడే. శంబరుడు రాయి కట్టి అతన్ని అగడ్తలో పారేసిపోయిన కొద్దిసేపటికే బెస్తలు అక్కడికి వచ్చి అతన్ని తమ వలలో పైకిలాగారు.

మనిషిలో ఇంకా ప్రాణం ఉందని తెలియగానే బెస్తలు అతన్ని మోసుకుని తమ పల్లెకు తీసుకుపోయి తలకు కట్టుకట్టి, శరీరమంతా మర్దనచేసి కుచుమారుడు ప్రాణం కోలు



కునేటట్టు చేశారు. ఒకటి రెండు రోజులు అతనికి ఆహారం పెట్టి ఉపచారాలు చేసిన మీదట కుచుమారుడు మామూలు మనిషి అయినాడు. కాని తానెవరో వాళ్లకు చెప్పటానికి అతను సిగ్గుపడ్డాడు. అందుచేత అతను వాళ్లతోనే ఉంటూ, రోజూ వాళ్లతో పాటు నదికి వెళ్లి, బల్లకట్టు నడపటంలో సాయపడ సాగాడు.

ఇక్కడ శంబరుడు తానే కుచుమారుణ్ణని చెప్పుకుంటూ, సరస్వతిని తనకిచ్చి వివాహం చెయ్యమని రాజును తొందరపెట్టసాగాడు. సరస్వతి ఇందుకు సమ్మతించి, ముహూర్తం పెట్టించి పెళ్లి ప్రకటించమనీ, దేశదేశాలలోని పండితుల నందరినీ పెళ్లికి ఆహ్వానించమనీ తన తండ్రితో చెప్పింది. కుచుమారుడు ఈ ప్రకటన విని వస్తాడనీ, ఒకవేళ రాకపోతే, కుచుమారుడనని చెప్పుకునేవాణ్ణి మోసగాణ్ణి, పండితులు సులువుగా పట్టుకుంటారనీ ఆమె ఆశపడింది.

ఈ సంగతులేవీ కుచుమారుడికి తెలియవు. ఒకరోజు ఉదయం అతను నదిమీద బల్లకట్టు నడుపుతూ ఉండగా కొందరు పండితులు అవతలి ఒడ్డున బల్లకట్టు ఎక్కి ఇవతలికి వచ్చారు. వాళ్లు మాట్లాడుకునే మాటలనుబట్టి ఆ రోజే తనకూ, రాజకుమార్తె సరస్వతికీ పెళ్లి జరగబోతున్నదని



తెలుసుకుని అతను ఆశ్చర్యపడ్డాడు. తాను లేకుండా రాజకుమార్తె తనను ఎలా పెళ్లాడు తున్నదో ఆ వింత చూద్దామని, అతను బల్ల కట్టును ఒడ్డున కట్టేసి, పండితుల వెనకే రాజధానికి బయలుదేరాడు.

పెళ్లికి భోజరాజు మొదలుగాగల మహా రాజులూ, మహాకవులూ, విద్వాంసులూ అనేకమంది వచ్చారు. శంబరుణ్ణి పెళ్లి కొడుకునుచేసి కూచోబెట్టారు. అతన్ని చూడ గానే పెళ్లికి వచ్చినవారిలో కొందరు, అతను కుచుమారుడు కాడని పోల్చుకున్నారు. వారు కుచుమారుడి మిత్రులు, కాశీ వాసులు. వెంటనే వారు శంబరుడివద్దకు పోయి వాడికి పాండిత్యం ఏమీ లేదని రుజువు చెయ్యటానికిగాను కొన్ని ప్రశ్నలు వేశారు. సమాధానాలు చెప్పలేక శంబరుడు తెల్లమొహం వేశాడు. సభలో అల్లరి బయలు దేరింది. రాజుగారు శంబరుడిదగ్గిరికి వచ్చి, "ఎవరు నీవు? నీ అసలుపేరేమిటి?" అని అడిగాడు. శంబరుడు వణికిపోతూ జరిగిన దంతా చెప్పేశాడు.

రాజు అంతా విని మండిపడి, "వీణ్ణి వెంటనే యిక్కణ్ణించి తీసుకుపోయి తల కొట్టండి!" అని ఆజ్ఞాపించాడు.

ఈ వినోదమంతా ఒక మూలనుంచి చూస్తున్న కుచుమారుడు ముందుకు వచ్చి, "మహారాజా, అతన్ని క్షమించండి. అజ్ఞానం చేత అటువంటి పని చేశాడు. అతని తల్లి దండ్రులు చాలా గౌరవనీయులు. నేనే కుచుమారుణ్ణి. నే నతన్ని క్షమిస్తున్నాను గనక మీరు శిక్షించ నవసరంలేదు!" అన్నాడు వినయంగా.

సరస్వతి చెలికత్తె ఒకతె కుచుమారుణ్ణి గుర్తుపట్టింది. వివాహానికివచ్చిన కవులూ పండితులూ చాలా సంతోషించారు. రాజు శంబరుణ్ణి శిక్షించక వదిలేశాడు. ఆ రోజే సరస్వతికీ, కుచుమారుడికీ మహావైభవంగా వివాహం జరిగింది.





# రంగన్న విశ్వాసం

గోదావరీతీరాన చల్లపాలెం, తెల్లపాలెం అని రెండు జమీందారీ గ్రామాలుండేవి. రెండు గ్రామాల జమీందార్లూ దూరపు బంధువులు, స్నేహితులుకూడా. అందుచేత వారు ఒకరి నొకరు చూడవచ్చి, కొన్నాళ్ళు ఉండి, వెళ్లి పోతూ ఉండేవారు.

ఒకసారి ఇలాగే చల్లపాలెం జమీందారు తెల్లపాలెం జమీందారును చూడవచ్చాడు. ఆ సాయంకాలం స్నేహితులిద్దరూ ఆరుబయట కుర్చీలు వేసుకుని కూచుని మాట్లాడుకుంటుండగా తెల్లపాలెం జమీందారుగారి పశువులమందను తోలుకుని పాలెకాపు రంగన్న వచ్చాడు.

రంగన్నను చూస్తూనే యజమాని, "మన పొటే లెక్కడరా?" అని అడిగాడు.

"వస్తున్నది, దొరా!" అని రంగన్న గట్టిగా ఈలవేశాడు. వెంటనే ఒక తెల్ల పొటేలు, మెళ్లో మువ్వలు మోతచేసుకుంటూ, చెంగు చెంగున దూకుతూ వచ్చింది. అది ముందు రంగన్నదగ్గిరికి వచ్చి, తరవాత తన అసలు యజమాని దగ్గిరగా నిలబడింది.

జమీందారు జేబులోనుంచి గుప్పెడు పచ్చి శనగలు తీసి దానికి మేపాడు. శనగలన్నీ తిని పొటేలు వెళ్లిపోయింది.

జమీందారు తన అతిథికేసి తిరిగి, "నాకు మిగిలిన పశువులన్నీ ఒక ఎత్తూ, ఈ పొటేలు ఒక ఎత్తూనూ! ఇవాళ దాన్ని వెయ్యి రూపాయల కెవరన్నా కొంటా నన్నా అమ్మను. ఎందుకంటే అటువంటి పొటేలు ఈ చుట్టుపక్కల ఎక్కడా లేదు. నిజానికి దాన్ని అలా పెంచి మచ్చికచేసిన కీర్తి మా రంగడికే దక్కాలి. వాడిలాటి విశ్వాసం గల వాడు ఎక్కడా ఉండడు!" అన్నాడు.

ఈ మాటలు విని చల్లపాలెం జమీందారుగారు వేళాకోళంగా నవ్వి, "మీకేమన్నా

పి. రాజలింగం



పిచ్చా ఏమిటి? నౌకర్లకు విశ్వాసమేమిటి? అందరూ దొంగ వెధవలే! అవకాశం దొరికితే చాలు, మోసంచేస్తారు!" అన్నాడు.

తెల్లపాలెం జమీందారు ఈ మాటలకు ఆశ్చర్యపోతూ, "రంగడు అటువంటివాడు కాడు! వాడి సంగతి నాకు తెలుసు. ప్రాణం పోయినా అబద్ధం ఆడడు!" అన్నాడు.

"ఏమిటి మీరనేది? వాడు మీతో ఎన్నడూ అబద్ధం చెప్పనే లేదంటారా?" అని అడిగాడు అతిథి.

"ఎన్నడూ వాడు నాతోగాని ఇంకొకరితో గాని పల్లెత్తు అబద్ధం చెప్పలేదు," అన్నాడు తెల్లపాలెం జమీందారు.



"మీ అమాయికత్వానికి నాకు నవ్వొస్తోంది. మూడు రోజులు గడువివ్వండి, వాడు మీతో అబద్ధం చెప్పినట్టు రుజువు చేస్తాను. ఏమంటారు?" అన్నాడు అతిథి, బిగ్గరగా నవ్వుతూ.

"మీరు ఎన్నటికీ రుజువు చెయ్యలేరు!" అన్నాడు తెల్లపాలెం జమీందారు. ఇద్దరూ కొంచెంసేపు రెట్టించుకుని చివరకు పందెం వేసుకున్నారు. రంగడు అబద్ధం చెప్పినట్టు రుజువైతే చల్లపాలెం జమీందారుకు తెల్లపాలెం జమీందారు వెయ్యి రూపాయలివ్వాలి; రుజువు చెయ్యలేకపోతే చల్లపాలెం జమీందారే, తెల్లపాలెం జమీందారుకు వెయ్యి రూపాయలిస్తాడు!

"మీ దగ్గిర తప్పకుండా వెయ్యి రూపాయలూ గెలుచుకుంటాను. కాని మన పందెం గడువు దాటేదాకా ఈ విషయం మన ఇద్దరికీ తప్ప మూడోవాడికి మాత్రం తెలియనివ్వకండి!" అన్నాడు అతిథి. తెల్లపాలెం జమీందారు ఇందుకు సరే నన్నాడు.

చల్లపాలెం జమీందారుగారు ఆ రాత్రి, తన నౌకరు సోమన్నతో సంగతంతా చెప్పేసి, "ఏంరా, సోముడూ? మనం పందెం గెలవటానికేదైనా తిరుగులేని ఉపాయం చెప్పగలవా?" అని అడిగాడు.





సోమన్నకు పెద్ద చిక్కే వచ్చింది. సహాయం చేస్తానంటే తాను మోసగాడినని యజమానిదగ్గిర ఒప్పుకున్నట్టు అవుతుంది. అందుచేత వాడు, "నేను తమరికి సలహా ఇవ్వగల పాటి వాణ్ణా, దొరా?" అన్నాడు.

సోమన్న ఎందుకు తటపటాయిస్తున్నాడో జమీందారుకు అర్థమయింది. వాడి అనుమానం పోగొట్టటానికిగాను ఆయన, "ఒరే, నేనీ పందెం గెలిచేట్టుచేస్తివా, నీకు నూరు రూపాయలు ఈనా మిస్తా!" అన్నాడు.

"అలాగే చెయ్యండి, దొరా. రంగన్న ఆకాశంనుంచి ఊడిపడ్డాడా? డబ్బాశ చూపిస్తేవాడేం చెయ్యమంటే అదే చేస్తాడు!" అన్నాడు సోమన్న ధైర్యంగా.

"అయితే, చూడూ! నీ చేతికి రెండు వంద లిస్తాను. ఆ పాటేలును కొనెయ్యి," అంటూ చల్లపాలెం జమీందారుగారు తన నౌకరు సోమన్నచేతికి రెండు వందలిచ్చాడు.

సోమన్న ఒకటి రెండు రోజుల్లో రంగడి విషయాలన్నీ తెలుసుకున్నాడు. దానితో రంగన్నను ఎట్లా బుట్టలో వెయ్యాలో వాడికి తెలిసిపోయింది.

కొంతకాలంగా రంగన్న లక్ష్మి అనే పిల్లను పెళ్ళాడటానికి మాటలు జరుగుతున్నాయి. ఇద్దరూ పెళ్ళికి వప్పుకున్నారు. కాని రంగన్న నిరుపేద, ఇల్లూ వాకిలీ కూడా లేదు. జమీందారుగారి గొడ్లపాకలోనే వాడు పడుకుంటాడు. లక్ష్మి తండ్రికి రెండు కుంటల పొలం ఉన్నది.

"నువు నా కూతుర్ని చేసుకోదలిస్తే నాకేమీ అభ్యంతరంలేదు. కాని ముందుగా ఒక చిన్న ఇల్లూ, దొడ్డీ, ఏర్పాటుచేసుకుని ఆ తరవాత పెళ్ళిమాట అడుగు!" అనేవాడు లక్ష్మి తండ్రి.

ఇల్లూ పొలమూ సంపాదించటంమటుకు రంగన్నవల్ల కాలేదు. వాడు అప్పుడప్పుడూ లక్ష్మితో ఒంటరిగా మాట్లాడి, "మరి మన పెళ్ళి మాటేమిటి?" అని అనేవాడు. లక్ష్మి



తన తండ్రి అన్న మాట జ్ఞాపకంచేసేది. రంగన్న తల వంచుకుని వెళ్లిపోయేవాడు.

ఈ సంగతి సోమన్నకు తెలియవచ్చింది. వాడు లక్ష్మి ఇంటికి వెళ్లి ఆమెతో ఒంటరిగా మాట్లాడాడు.

"నువూ, రంగన్నా పెళ్లి చేసుకుంటా రుటగా? నే విన్నాలే! చక్కని సంబంధం!" అన్నాడు సోమన్న.

"ఏం పెళ్ళి? నేను బతికుండగా అయేట్టు లేదు." అంటూ లక్ష్మి సంగతంతా సోమన్నతో చెప్పింది.

సోమన్న ఆశ్చర్యం నటిస్తూ, "ఈ భాగ్యానికే పెళ్ళి వాయిదా పడాలా? రెండు



వందలు పారేస్తే ఇంత కొంపా, దొడ్డీ కొన వచ్చుగా?" అన్నాడు.

"ఆ రెండు వందలు లేకేగా ఇంత అవస్థ పడటం?" అన్నది లక్ష్మి.

"లేకపోవటమేమిటి? నువుకూడా అమాయకంగా మాట్లాడతావు! ఆ తెల్ల పొటేలును నాకు అమ్మమను, ఈ క్షణాన రెండు వందలు కురిపిస్తాను!" అంటూ సోమన్న బొడ్డునుంచి రూపాయల సంచీ తీసి గలగల్లాడించాడు.

లక్ష్మికి రూపాయల చప్పుడు వింటుంటే ఆశ పుట్టింది. "అది జమీందారుగారి పొటేలుగా? రంగన్న ఎట్లా అమ్ముతాడు?" అన్న దామె.

"అదే పిచ్చి! ఆ పొటేలు రంగన్న సాకినది. ఏ లెక్కన జమీందారుగారి దయింది? దానిని నీకు బహుమానంగా ఇయ్యమను! పొటేలు నీదైనాక నాకు అమ్ము. ముందే డబ్బు పుచ్చుకో!" అన్నాడు సోమన్న.

సోమన్న మోసం లక్ష్మి మీద పూర్తిగా పారింది. ఆ రోజు సాయంకాలం రంగన్న తనతో మాట్లాడటానికి వచ్చి, "మన పెళ్ళి మాట ఏమిటి?" అని అడిగినప్పుడు, లక్ష్మి, "అది నీ చేతిలోనే ఉంది!" అన్నది.





రంగన్న ఆశ్చర్యంతో, "నా చేతిలో ఉంటే ఏనాడో ఒక ఇల్లూ, దొడ్డీ సంపాదించక పోయానా?" అన్నాడు.

"నీ పొటేలుకు మంచి బేరం వచ్చింది. దాన్ని అమ్ము. రెండు వందలిస్తారు. దానితో మనకు ఇల్లూ, దొడ్డీ వస్తుంది. మన పెళ్ళి ఆగనవసరం లేదు!" అన్నది లక్ష్మి.

"అమ్మటానికి ఆ పొటేలు నా సొమ్మా? ఆ ఆలోచన మరిచిపో! మన పెళ్లి కాక పోయినా మానె గాని నేను మాత్రం ఆ పొటేలును అమ్మను!" అన్నాడు రంగన్న.

లక్ష్మి మొహం ముడుచుకుని, "పోనీ నువు అమ్మనేవద్దు; నోరు తెరిచి అడుగుతున్నాను, దాన్ని నాకు బహుమానంగా ఇచ్చెయ్యి!" అన్నది.

రంగన్న మొహంలో ఎంతో బాధ కనిపించింది, "లక్ష్మి, నా ప్రాణమైనా ఇస్తాను గాని, ఆ పొటేలు నివ్వలేను! ఏమీ అనుకోకు!" అంటూ రంగన్న వెళ్లటానికి వెనక్కు తిరిగాడు.

లక్ష్మి కంట నీరు కారుస్తూ అతన్ని వెనక్కు పిలిచి, "నాకు నువ్వింత అన్యాయం చేస్తావనుకోలేదు! నేను నోరు తెరిచి అడిగితే పొటేలు నివ్వకపోతావా అన్న భ్రమతో ఆ పొటేలును బేరంపెట్టి సొమ్ముకూడా ముందే తీసుకున్నాను! నా పరువు కాస్తా పోతుంది!" అంటూ రంగన్నకు రూపాయల మూట చూపించింది.

రంగన్న క్షణంపాటు నిర్ఘాంతపోయి, "నీకి డబ్బిచ్చిన మనిషి ఎవరు?" అని అడిగాడు అనుమానంగా.

"చల్లపాలెం జమీందారుగారి మనిషి సోమన్న!" అన్నది లక్ష్మి.

రంగన్న కొంచెంసేపు ఆలోచించి, "నీ పరువు నే నెందుకు తీస్తాను, లక్ష్మి? ప్రాణం పోయినా మాట పోరాదు! రేపు మధ్యాన్నానికల్లా పొటేలును నీ కిచ్చేస్తాను. నీ మాట నువు నిలబెట్టుకో!" అన్నాడు.

మర్నాడు సాయంకాలంలోపల తెల్ల పాలెం జమీందారుగారి పాటేలు చల్లపాలెం జమీందారుగారి పరమయింది.

ఆ సాయంకాలం ఇద్దరు జమీందార్లూ మామూలు ప్రకారమే ఆరుబయట కూచుని ఉండగా రంగన్న మందను తోలుకుని అటుగా వచ్చాడు.

తెల్లపాలెం జమీందారుగారు జేబులో చెయ్యిపెట్టి పచ్చి శనగలు తీస్తూ, "పాటే లేడేరా?" అన్నాడు.

"దాన్ని నిన్ననే అమ్మేశాను, దొరా!" అన్నాడు రంగన్న.

జమీందారుగారు కాస్సేపు నిర్ఘాంత పోయి, "అదేమిటి? నాతో చెప్పకుండానే? ఎందుకు చేశావా పని?" అన్నాడు.

"దొరా, తొందరపడి నన్నేమీ అనకండి. నేను పెళ్ళాడదామనుకుంటున్న లక్ష్మి మూలంగా నేను గోతిలో పడ్డాను. దాన్ని గోతిలోకి తోసిన దుర్మార్గుడు ఇంకొకడున్నాడు. వాడు మర్యాదగా పాటేలును తిరిగి ఇచ్చేట్టయితే నేను వాడిపేరు బయట పెట్టను!" అంటూ రంగన్న సోమన్నకేసి ఒకసారి చూశాడు. తరవాత వాడు సోమన్న పేరు మినహాగా జరిగినదంతా చెప్పాడు.

అంతా విని చల్లపాలెం జమీందారు సోమన్నకేసి చూసి పళ్ళు కొరుకుతూ, "దద్దమ్మగాడా! ఇదా నువు చేసిన ఘన కార్యం? నేను పందెం ఓడనే ఓడాను. రంగన్నచేత అబద్ధం ఆడించలేకపోయాం! నిజంగానే వాడు నమ్మకస్తుడు. వాడికి పాటేలును తిరిగి ఇచ్చెయ్యి. రంగన్నా, లక్ష్మికిచ్చిన రెండు వందలూ ఉంచుకుని ఇల్లూ, దొడ్డీ సంపాదించుకో! మీ రిద్దరూ పెళ్ళాడి సుఖంగా ఉండండి!" అన్నాడు.

తెల్లపాలెం జమీందారుకూడా రంగన్న పెళ్లికి అన్ని విధాలా సహాయం చేశాడు. కొద్ది రోజుల్లోనే లక్ష్మికీ రంగన్నకూ వైభవంగా పెళ్లి అయింది.





# మిత్రభేదం

ఆ మ్మాటలెల్ల ని-జమ్మని తలచి
అ మ్మడుంగున చాటె-నా వార్త పీత.
పిలపిల జలచర-మ్ములు కట్టగట్టి
కలతతో కొంగ పం-చల నిల్చిపలికె :
"మామ! మాకేదైన - మార్గమ్ము చూపి
ఈమాదిరిగ చావ-నీక కాపాడు."
అని వేడగా కొంగ - అనె నిట్లు తిరిగి :
"విను డొక్క కోన దా-పున నుండు నిటకు
కరువు కాటకములు - కానరా వచట.
పరిపూర్ణముగ సరో-వరముండు నెపుడు
పదులు పన్నెండేండ్ల - పాటున కాదు,
పదునాలుగేండ్లొక్క - పదును గాకున్న
నీ రెండిపోవదా - నిండు మడుంగు.
నీరధివలెనుండు - నే ప్రొద్దుగూడ.
అక్కడ కెట్లొ మి-మ్మందర జేర్తు
ఒక్కొక్కరే వీపు - నెక్క కూర్చున్న."
ఆ మాట విని పాప - మవి యెల్ల నమ్మి
గోము జేయుచు చేరె - కొంగ చుట్టూర.

ఒక్కొక్క చేపనే - ఎక్కించుకొనుచు
ప్రక్కకు పోయి పెన్ - బండపై వేసి
తృప్తిగా తినివచ్చి - తిరుగ వారలకు
ఆప్తునివలె మాట - లటు చెప్పు కొంగ.
ఇటు కొన్నిరోజు లొ-క్కటి ఒక్కటిగనె
కటకట చేప లా - కపటి పాలయ్యె.
ఒకనాడు పీత, న-న్నిక గొనిపొమ్ము
సుకముగా నుందు నం-చును పట్టుబటె.
కాని మ్మటంచు కొం-గయు పీత గొనుచు
తా నేగుచుండ దూ-రాన గన్పించె.
చేపల పొలుసులు - చేటల కొలది
ఆ పీత కెందుకో - అనుమానమయ్యె.
"అలత సెందితివి మా-మా! నన్ను మోసి
కొలనెంత దవ్వున - గలదొ వచింపు"
అని యెండ్రి అడిగిన. - ఆ కొంగ నవ్వి
పని తీరెనని ధైర్య-మున పల్కె నిట్లు :
"కొలను లే దల్లుడా - కోనము లేదు ;
అల బండపై నిన్ను - బలిగొందు నంతె."

విద్వాన్ విశ్వం



ఆ మాట అనుచుండు-నంతలో పీత
కోమలమ్మగు మెడ - కొండ్లతో నదిమె.
కొంగ కృష్ణా అను-కొన్న తర్వాత
అంగలతో పీత - ఆ గుంట చేరె.

* * *

దమనకుడు :

కావున కరటకా - కలదేని తెలివి
ఏ విధమ్మననైన - నెదిరి గెల్చెదము.
బల మన్నచో బుద్ధి-బలమె బలమ్ము
అల బుద్ధిహీనుని - బల మేమి బలము ?
పొగరువట్టిన సింహ - మొకటి, కుందేటి
తగవులో మడసిన-దని వినలేదె ?

కరటకుడు :

ఆ సింహ మెవ్వర-న్నా ? కథ ఏమి ?



అసాంతముగ చెప్పి - ఆనందపెట్టు.

దమనకుడు :

సింహము, కుందేలు కథ :

ఒక వనమ్మున నుండె - నొక్క సింహమ్ము
చకచక మృగముల - సంహరించుచును.
ఇటులైన వనము పా-డేయని వచ్చె
కటకటతో దాని-కడకు మృగాలు.
"దిన మిన్ని ప్రాణాల - తీయుట యేల ?
తిను టొక్కటేగదా - మనవిని వినుడు :
దినదిన మ్మొక మృగ-మ్మును బంతు మిటకు
తనియుడు దాన మీ - పనియును దప్పు
రాజు వర్ధిల్లును - ప్రజలు వర్ధిల్ల
రాజు నశించు వా-రలు నశియింప."
అను మాట కా సింహ-మును సమ్మతించె;
దినదిన మ్మొక మృగ-మ్మును వచ్చుచుండె.
వరుసగా కుందేలు - వంతును వచ్చె
దొరదగ్గఱకు బోవు-తరి నొక్క బావి
కనరాగ కుందేలు - తన నీడజూచి
అనుకొనె దొరనెట్లొ - అంతమొందింప.
పొద్దు వాలినదాక - పొదలలో తిరిగె
అద్దిరా పొగరని - అఱచె సింహమ్ము
తిన్నగా వచ్చి కుం-దే లిట్లు చెప్పె :
"మన్నించు దేవర - మనవిచేసెదను.
ఒకథనే మీ ఆక-లికి చాలనంచు





ఇక నైదుకుందేళ్ళ - నిట గొనిరాగ
త్రోవలో భూమిని - తొలుచుకవచ్చె
దేవర ! ఒక మృగా-ధిపతి ఏమందు ?
నిలుడని అదలింప - నేను మీ కొఱకు
పలు మృగమ్ములు బంప - పరువెత్తువాడ
విడుమన్న—నేనె ఇ-క్కడి వనరాజు
నడువగా వలయు ని-క్కడ నాదు ఆజ్ఞ
వాడెవ్వడో కొని-వత్తువా పొమ్ము
తోడుక రమ్ము చూ-తువుగాని లెమ్ము.
చెందును రాజ్యమ్ము - జెట్టికే అపుడు
అందాక మీవారి - నిందుంచి పొమ్ము.
అనుచున్న కొత్త సిం-హమునకు వెఱచి
మన రాజువచ్చిన - మరి మంచిదనుచు
సరియని వచ్చితి - స్వామి జాగయ్యె
శరణ"నె మాయావి - శశ మేడ్చుకొనుచు.
ఎవడు వాడిపుడె వ-ధింతు నటంచు
శివమెత్తి సింహమ్ము - చిందులు ద్రొక్క
'అది దుర్గమందున్న- దగుట జయించు
టది దుర్ఘటమ్మని' - పదఱె కుందేలు.
"ఎట నున్న సరియె నే - నిపుడె వధింతు
పటు విరోధిని వ్యాధి-వలె పుట్టి నపుడె
పుట మార్చవలెగాని, - పొంచియే యున్న
బటు వెక్క వైరి స-ఘా చేయు మనల"
అని సింహ మన్నంత - అనియె కుందేలు



"మనవి, అట్లయ్యు శ-త్రుని సత్త్వ మెఱిగి
ముందున కఱుగుట - ముఖ్య మూఱకయె
సందడి చేసిన - జరుగున దేమి"
అని ఎంతొ ఆ సింహ - మును ఊచ్చగొట్టి
కొనిపోయి బావిలో-ననె పగవాడు
దాగి యున్నాడని - దబ్బఱ పలికె.
ఔ గదా యని సింహ - మందులో జూచె.
తన నీడ యింకొక-డని హుంకరించి
తన ప్రతిధ్వని విని - తటుకున దూకె
బావిలో పడిపోయి - ప్రాణాలు విడిచె
ఆ వార్త మృగముల - కమృతమే యయ్యె.
కనుక తెల్వియె బల-మ్మను మాట వచ్చె
అని చెప్పె దమనకుం - డా కథ నెల్ల.



# నావికుడు సింద్‌బాద్

నేను చేసిన నాలుగు సముద్రయానాలూ నాకు అంతు లేని లాభాలు చేకూర్చాయి. ఎన్ని కష్టాలు పడ్డా నాకు ఈ ప్రయాణాలు అచ్చిరాగలవనీ, విశేషమైన అనుభవం గడించగలననీ నాకు ధైర్యం కలిగింది. అందుచేత కొంతకాలం సమస్త వైభోగాలు అనుభవిస్తూ ఇంటిపట్టున గడిపిన అనంతరం నేను మళ్ళీ అయిదవ ప్రయాణానికి సిద్ధపడ్డాను.

ఇందుకై బజారుకు వెళ్లి, లాభసాటిగా అమ్మకమయే సరుకు కొని బేళ్ళు కట్టించి, దానితో బస్రా చేరాను. నేను బస్రారేవులో దిగే సమయానికి అక్కడ ఒక పెద్దనౌక, సరికొత్తది అమ్మకానికి సిద్ధంగా వుంది. దాన్ని చూడగానే నాకు చాలా ముచ్చటయింది. వెంటనే బేరంచేసి ఆ నౌకను కొనేశాను. తరవాత, మంచి అనుభవం గల సరంగునూ, సమర్థులైన కళాసులనూ జీతానికి ఏర్పాటుచేసుకుని, నా బానిసలచేత నా సరుకంతా నౌకలోకి పట్టించాను. ఈ బానిసలు ప్రయాణంలో నా వెంట ఉండటానికి ఇంటినుంచి తెచ్చుకున్నవాళ్లే. నేను బయలుదేరే లోపుగా కొందరు వర్తకులు నావెంట రాగోరి, ప్రయాణపు ఖర్చులు

అయిదవ సముద్రయానం

CHITRA



ముందుగానే నాకిచ్చుకున్నారు. ఈసారి నౌక నాదే గనక, మా సరంగుకు నేను సరి అయిన సలహాలివ్వగల ననుకున్నాను. ఏమంటే ఇప్పటికి సముద్రయానంగురించి నాకు చాలా అనుభవం అయింది.

మేము బస్రానుంచి చాలా ఉత్సాహంగా బయలుదేరాం. గాలి అనుకూలంగా వుంది. సముద్రం ప్రశాంతంగా ఉంది. మా నౌక అనేక రేవులు తాకింది. ప్రతి రేవులోనూ క్రయవిక్రయాలు సక్రమంగా సాగాయి. చివరకు ఒకసారి మేము ఒక నిర్జనమైన దీవివద్ద లంగరు దించాం. వర్తకులందరూ దిగి దీవి చూడబోయారు. అక్కడ వారి కొక గండభేరుండపక్షి గుడ్డు కనిపించింది. అదేమిటో తెలియక వాళ్లు దానిపై రాళ్ళు విసిరారు. కొంతసేపటి కది చిట్లి అందులో నుంచి పిల్ల కాలు బయటికి వచ్చింది. అమాయకులైన వర్తకులు ఆ పిల్లను బయటికి లాగి, దాన్ని కోసి తలా ఒక ముక్కా తీసుకుని నౌకకు తిరిగి వచ్చారు.

వారు చేసిన పనిగురించి వినగానే నాకు పట్టరాని భయం కలిగింది. "మీరు కొంప ముంచేశారు! ఆ పిల్లకోసం గండభేరుండ పక్షి దంపతులు త్వరలోనే వచ్చి, జరిగినది తెలుసుకుని, మనని హతమార్చేస్తాయి!



చేతనైనంత వేగంగా పారిపోవటం తప్ప వేరే మార్గం లేదు," అంటూ తెరచాపలు ఎత్తించి, నౌకను సముద్రంవేపు పట్టించాను.

ఈ లోపల తాము తెచ్చుకున్న పక్షి ముక్కలు వండించుకున్నారు. కాని వారు వాటిని తినబోయే లోపలే ఆకాశాన సూర్యుడికి రెండు మేఘాలు అడ్డుతగిలినట్టయింది. అవి మమ్మల్ని సమీపిస్తుంటే, గండభేరుండ పక్షులని మాకు స్పష్టమయింది. వాటి రెక్కల చప్పుడూ, అరుపులూ వింటూంటే ఆకాశం గర్జిస్తున్నదని పించింది. అవి మా నౌకకు ఎగువను ఎత్తుగా ఎగురుతున్నప్పుడు వాటి గోళ్లలో రెండు బ్రహ్మాండమైన రాళ్లు,

మా నౌకకంటె పెద్దవి, ఉన్నట్టు మాకు కనిపించింది. మా వర్తకులు తమకు చేసిన ద్రోహానికి అవి ఏ విధంగా పగ తీర్చుకో దలిచాయో నాకు బోధపడింది.

చూస్తుండగానే ఒక పక్షి తన గోళ్ల మధ్య ఉన్నరాతిని నేరుగా నౌక మీదికి వదిలింది. కాని మా సరంగు ఎంతో యుక్తిగా చుక్కాని పక్కకు తిప్పేసి నౌకను కాపాడాడు. ఆ రాయి మా పక్కనే పడింది. అది పడిన చోట నీటిలో ఎంత పెద్దగొయ్యి పడిందంటే మాకు సముద్రం అడుగు కనిపించింది. ఆ రాయిపాటుకు లేచిన అలల మూలంగా మా నౌక బెండు అడినట్టు ఆడిపోయింది.

ఇంతలోనే రెండోపక్షి రెండోరాయి పడేసింది. దాని దెబ్బకు నౌకలో సగంభాగం పప్పు పప్పు అయిపోయింది. రాతి దెబ్బకు పచ్చడి అయిపోగా మిగిలినవారంతా సముద్రంవాతపడ్డారు. నేను ప్రాణం దక్కించుకునేటందుకు విశ్వప్రయత్నాలు చేస్తూ అదృష్టవశాత్తూ ఒక కొయ్యముక్కను సంపాదించి దాని సహాయంతో తేలాను. దానిమీద ఎక్కి కాళ్లతో తెడ్డువేస్తూ, గాలి సహాయానా, అలల సహాయానా, కొన ప్రాణంతో ఒక దీవిమీద వెళ్లిపడ్డాను. ఒక గంటసేపు ఇసకలో పడుకున్నాక గుండె దడ కాస్త తగ్గింది, బలం కాస్త తిరిగి



వచ్చింది. అప్పుడు నేను లేచి దీవిని పరీ క్షించటం ప్రారంభించాను.

అది నిజంగా భూలోకస్వర్గమే. ఎటు చూసినా చెట్లమీద పచ్చగా పండిన పళ్లు న్నాయి. చెట్లమీద రంగురంగుల పక్షులు కలకల నాదాలు చేస్తున్నాయి. నేలపైన పూలమొక్కలు రంగుల తివాసీ పరిచి నట్టుగా మనోహరంగా ఉండి, కమ్మని సువా సనలు వెదజల్లుతున్నాయి. నేను వృథా కాలయాపన చేయక వెంటనే పళ్లు కోసుకు తిని, నిర్మలమైన సెలయేటి నీరు తాగి, పువ్వుల పాన్పులాటి నేలపై పడుకుని విశ్రాంతి తీసుకున్నాను.

చీకటి పడే సమయానికి నాకు మెళుకువ వచ్చింది. నా పరిసరాలు మనోహరంగా ఉన్నాయని తెలిసినా, ఒంటరిగా ఆ దీవిలో ఉండటం మూలాన నాకు చాలా భయం కలిగింది. ఆ రాత్రల్లా నాకు సరిగా నిద్ర లేదు. నిద్రపోయినప్పుడు భయంకరమైన పీడకలలు వచ్చాయి. ఎలాగైతేనేం తెల్ల వారింది, నాకు మనస్థిమితం కలిగింది. నేను లేచి దీవి యావత్తూ కలయ తిరగసాగాను.

త్వరలోనే నే నొక మడుగుదగ్గిరికి వచ్చాను. అందులోకి ఒక జలధార పడు తున్నది. మడుగు అంచున ఒక ముసలాడు కూచుని ఉన్నాడు. ఆకులు గుచ్చి ఒక





దుప్పటిలాగా చేసి దాన్ని కప్పుకుని ఉన్నాడు. "ఎవరో నావికుడు. ఓడ పగిలిపోతే ఒడ్డుచేరి ఉంటాడు," అనుకున్నాను.

నేను ముసలాణ్ణి సమీపించి పలకరించాను. ఆ ముసలాడు సంజ్ఞలతో మాత్రమే సమాధానం చెప్పాడు. "ఏం, మహానుభావా? మీరిక్కడికెలా వచ్చారు?" అని అడిగాను. ఆయన విచారంతో తల అడ్డంగా తిప్పి, తనను నా భుజాలమీద ఎక్కించుకుని ప్రవాహం దాటించమన్నట్టుగా సంజ్ఞలు చేశాడు. అవతలి గట్టున ఉన్న చెట్ల ఫలాలు తినాలని ఉన్నట్టు కూడా సూచించాడు.



ఈ ముసలాడికి ఉపకారంచేస్తే అ పుణ్యం ఊరికే పోదనిపించింది. నేను వంగి ఆయనను నా భుజాలమీద ఎక్కించుకున్నాను. ఆయన తన తొడలు నా కంఠం చుట్టూవేసి, కాళ్లు పెనవేసి నా రొమ్ముమీద పెట్టి, తన చేతులతో నా తల పట్టుకున్నాడు. నే నాయనను ప్రవాహం దాటించి ఆయన చూపిన చోట వంగి, "బాబూ, మెల్లిగా దిగండి!" అన్నాను. కాని ఆయన కదల లేదు. పైపెచ్చు తన తొడలతో నా కంఠాన్ని మరింత గట్టిగా నొక్కుతూ, నా భుజాల మీద మరింత బరువుగా కూచున్నాడు.

నాకు ఆశ్చర్యం వేసింది. నే నాయన కాళ్లకేసి మరింత పరీక్షగా చూతునుకదా, అవి నల్లగా, బొచ్చుతో, దున్నపోతు కాళ్ల లాగున్నాయి. నా కేదో భయం పట్టుకుంది. ఆ మనిషిని కిందికి పడెయ్యాలని యత్నించాను. కాని ఆ మనిషి నా కంఠం మరింత గట్టిగా నొక్కాడు. నాకు ఊపిరాడలేదు. కళ్లు చీకటైపోయాయి. ఆయన్ని వదిలించుకోవటానికి మరొక తుదిప్రయత్నం చేసి ఆ తరవాత స్పృహతప్పి పడిపోయాను.

నాకు మళ్లీ స్పృహ తెలిసేసరికి ముసలాడింకా నా భుజాలమీదనే ఉన్నాడు. అయితే వాడి ధర్మాన కాళ్ళు కొంచెం





సడలించి, నాకు ఊపిరి అందేటట్టు మాత్రం చేశాడు. నాకు ఊపిరి ఆడుతూండటం గమనించగానే ముసలాడు నన్ను గుండెల్లో కాళ్లతో ఒక తన్నుతన్నాడు. నేను లేచి నిలబడ్డాను. తరవాత వాడు ముందుకు వంగి చెయ్యిచాచి, చెట్ల కిందుగా వెళ్లమని సంజ్ఞచేశాడు. నే నలాగే చేశాను. వాడు చెట్ల మీది పళ్లలో మంచివన్నీ ఏరి తాపీగా తిన సాగాడు. నేను తన కిష్టం లేనప్పుడు ఆగినా, తనకు కావలిసిన దానికంటె వేగంగా నడిచినా నా రొమ్ముల్లో తన్నుతూ తనకు కావలిసిన విధంగా నన్ను నడిపించాడు. ఆ రోజల్లా నేను వాణ్ణి పశువు మోసినట్టు మోశాను. ఆ రాత్రి పడుకున్నప్పుడుకూడా వాడు నా భుజాలమీదినుంచి దిగలేదు. తెల్లవారగానే నన్ను తన్ని లేవగొట్టాడు.

ఆ పగలూ, రాత్రీకూడా నేను వాణ్ణి మోశాను. చేతులతో, కాళ్లతో తన్నుతూ వాడు తనకు కావలిసినట్టుగా నాచేత పని చేయించుకున్నాడు. ఈ ముసలాడి సేవలో నేను అనుభవించిన శరీరబాధగాని అవమానంగాని నా జన్మలో నే నెన్నడూ పడినవాణ్ణికాను. వాడి బలం యువకుల కుండదు. గాడిదలు కాసేవాళ్లుకూడా వాడంత దయా దాక్షిణ్యాలు లేకుండా



ఉండరు. వాణ్ణి వదిలించుకునే దారేమో కనబడలేదు. "ఈ ముసలాడిమీద నా కెందుకు కనికరం కలగాలి? ఇంతకన్న చావు వచ్చినా బాగుండి పోనే!" అని విచారిస్తూ వాడు తిప్పినట్టల్లా తిరిగాను.

ఇలా అనేక వారాలు గడిచాయి. ఒక నాడు నేను వాణ్ణి మోసుకు పోతూండగా కొన్ని చెట్ల కింద సొరపాదులు కనిపించాయి. వాటికి పెద్దపెద్ద సొరకాయలున్నాయి. వాటిల్లో పెద్దదిగా, ఎండుదిగా చూసి ఒకటి ఏరి, దాన్ని డొల్లచేసి, శుభ్రంచేసి, అందులోకి ద్రాక్షపళ్ల రసం పిండాను. తరవాత దాని మూతికి బిరడా పెట్టి ఎండలో పెట్టాను.



కొద్ది రోజులకల్లా అది పులిసి సారా అయింది. తరవాత అవకాశం దొరికినప్పుడా సొర కాయ బుర్ర ఎత్తి అందులోనుంచి కొంత తాగాను. ఆ ద్రాక్షసారా తాగితే వచ్చిన ఉత్సాహంతో ఈ భుజంమీది బరువు మరింత సులువుగా మోయవచ్చునని నా ఆశ. నేను పరిమితంగా తాగటంచేత ఒళ్ళు తెలియకుండా పోవటానికి బదులు ఉత్సాహం వచ్చింది. ఆ ఉత్సాహంలో నేను భుజం మీది బరువుతోనే అటూ ఇటూ గెంత సాగాను, పాడుతూ, నృత్యంచేస్తూ, నా నృత్యానికి నేనే ఆనందించి చప్పట్లు కొట్ట సాగాను. నా హర్షధ్వానాలతో చుట్టూ ఉన్న తోట అంతా మారుమోగి పోయింది.

ముసలాడు నాలో వచ్చిన బలాన్ని గమనించి, బుర్ర తనకుకూడా ఇమ్మని సంజ్ఞ చేశాడు. వాణ్ణి చూస్తే భయంవల్ల గాని, లేకపోతే ఇవ్వకనే పోదును. నే నిచ్చిన బుర్ర తీసుకుని ముందు కొద్దిగా ద్రాక్షరసం రుచి చూశాడు. తరవాత బుర్ర ఎత్తి లోపలి సారా అంతా తాగేసి, ఖాళీ బుర్రను దూరంగా చెట్లమధ్య విసిరి పారేశాడు.

త్వరలోనే వాడి బుర్ర తిరగసాగింది. వాడు నా భుజాలమీద నృత్యం చెయ్య సాగాడు. తరవాత నీరసించినట్టు కనబడ్డాడు. వాడి కండరాలలో పటుత్వం కాస్తా పోయింది. భుజంమీద సరిగా కూచోలేక మైకంతో ఇటూ అటూ ఒరగసాగాడు.

నామీద వాడి పట్టు సడలటం గమనించి, నా మెడచుట్టూ పెనవేసి ఉన్న వాడి కాళ్ళు విడదీసి, ఒక్క ఊపున వాడు అంత దూరం వెళ్ళి పడేట్టు తోశాను. వాడు పడిన చోటే ఉండి పోయాడు. నేను తడువుకోకుండా చెట్ల మధ్య కనిపించిన లావుపాటి రాయి ఒకటి ఎత్తుకొచ్చి వాడి తల కాస్తా చితక గొట్టేశాను. వాడు చచ్చాడు. నేను వాడి చెరనుంచి బయటపడ్డాను. అల్లా వాడి పట్ల కనికరిస్తాడనుకోను. (ఇంకా వుంది)






## 6

[ తొమ్మిదేళ్లపాటు ట్రోయ్‌నగరంపై గ్రీకుల ముట్టడి సాగిందిగాని, చెప్పుకోదగిన యుద్ధం మటుకు జరగలేదు. ఇంతలో గ్రీకులలో అగ్రవీరుడైన వజ్రకాయుడు ట్రోయ్‌నగరపు రాజకుమార్తెను, ప్రమోదినిని, చూసి ప్రేమించాడు. గ్రీకుపక్షాన్ని విడనాడినట్లయితే అతనికి ప్రమోదిని లభించేటట్టు కనబడింది. వజ్రకాయుడు ఏదో నెపంమీద రారాజుతో తగాదాపెట్టుకుని యుద్ధరంగాన్ని విడిచిపెట్టి వెళ్లాడు. వెంటనే ట్రోజనులు విజృంభించి, గ్రీకు బలాలను భంగపరిచి, వారి నౌకలలో ఒకదానికి చిచ్చు పెట్టారు. అప్పుడు—]

చంద్రప్రభుడి నావ మండుతూండటం కంటపడగానే వజ్రకాయుడి రక్తం ఉడికి పోయింది. గ్రీకుపక్షాన తానుగాని తన బలాలుగాని ఇంక యుద్ధం చెయ్యబోవటం లేదన్న ప్రతిజ్ఞను అతను కొంతవరకు ఉపసంహరించుకుని, గ్రీకులకు సహాయంగా తన బలాలను అప్పటికప్పుడే పంపాడు.

ఈలోపుగా పితృకీర్తి అనే గ్రీకుయోధుడు విజృంభించే ట్రోజను బలాలలో పెద్ద కలవరం కలిగించాడు. మండిపోతున్న గ్రీకు నౌకను చుట్టుముట్టిన ట్రోజను సైనికుల మధ్యకు అతనొక శూలాన్ని బలంగా విసిరాడు. ఆ శూలం ఒక వీరుడికి తగిలి అతను కూలిపోయాడు. ఇది చూసి ట్రోజనులు వజ్రకాయుడి పనేననీ, అతను యుద్ధరంగానికి తిరిగి వచ్చాడనీ అనుకున్నారు. వజ్రకాయుడంటే ట్రోజనులకు సింహస్వప్నం; అందుచేత వారు కంగారుపడి



చెల్లాచెదరై పారిపోసాగారు. ట్రోజనులకు ధైర్యం చెప్పి నిలపగల యోధుడెవడూ లేక పోయాడు. దురదృష్టవశాత్తూ వీరసింహుడు భూధవుడిచేత గాయపడి అంతకుపూర్వమే యుద్ధరంగాన్ని విడిచి ట్రోయ్‌నగరానికి తిరిగి వెళ్లిపోయాడు.

ట్రోజనులను ఈ విధంగా కలవరపరచిన పితృకీర్తి చంద్రప్రభుడి నావతాలూకు మంటలను ఆర్పి, పారిపోతున్న ట్రోజనులను తరమసాగాడు. అతను వజ్రకాయుడి కవచం ధరించి ఉండటంమూలాన ట్రోజనులు అతన్ని చూసి వజ్రకాయుడనే భ్రమపడ్డారు.



ఎలాగైనా ఆ రోజు ట్రోయ్‌నగరాన్ని వశపరచుకోవాలని పితృకీర్తి తీర్మానించుకున్నాడు. నగరం చుట్టూ ఉన్న కోట గోడలను ఎగబాకటానికి అతను మూడుసార్లు విశ్వప్రయత్నం చేశాడు. కాని ట్రోజనులు ఈ ప్రయత్నాలను సాగనివ్వలేదు.

చీకటి పడినదాకా యుద్ధం సాగుతూనే ఉన్నది. మసకచీకటిలో పితృకీర్తి వెన్నులో ఎవరో పొడిచారు. అతని శిరస్త్రాణం పడిపోయింది, అతని చేతిలో ఉన్న శూలం విరిగిపోయింది, అతను అసహాయ స్థితిలో ఉండిపోయాడు. ఇది గమనించి మరొక ట్రోజను వీరుడు అతన్ని ఇంకొక పోటు పొడిచాడు. పితృకీర్తి బాగా దెబ్బతిని, నిరాయుధుడై, తూలుతూ యుద్ధరంగం నుంచి వెళ్లిపోతూండగా, వీరసింహుడు యుద్ధరంగానికి తిరిగి వచ్చి పితృకీర్తిని ఒకే వేటుతో చంపేశాడు. తరవాత అతను పితృకీర్తి ధరించిన కవచాన్ని ఒలిచి తీసుకున్నాడు.

సరిగా ఈ సమయానికి ప్రతాపుడూ, భూధవుడూ అక్కడికి వచ్చి పితృకీర్తి శవం ట్రోజనుల వశం కాకుండా, బాగా చీకటి పడేవరకూ కాపాడి, తరవాత దాన్ని తమ నౌకలవద్దకు చేర్చారు.






పితృకీర్తి మరణ వార్త విని వజ్రకాయుడు మట్టిలో పొర్లాడి ఆడదానిలాగా శోకాలు పెట్టాడు. అతని తల్లి అయిన తటిని అతనికోసం సరికొత్త కవచం ఒకటి అప్పటికప్పుడు తయారుచేయించి అతని శిబిరానికి తెచ్చి ఇచ్చింది. వజ్రకాయుడు ఆ కవచాన్ని ధరించి రారాజుదగ్గిరికి వెళ్ళి ఆయనతో రాజీపడ్డాడు. తరవాత అతను పితృకీర్తి చావుకు పగ తీర్చుకోవటానికై యుద్ధరంగానికి బయలుదేరాడు.

అసలే ఆగ్రహావేశంలో ఉన్న వజ్రకాయుడు ప్రళయరుద్రుడిలాగా యుద్ధరంగానికి వచ్చేసరికి ట్రోజనులు అతని ధాటికి నిలవలేక చెదిరి పరిగెత్త సాగారు. వజ్రకాయుడు వారిని స్కమందర్ నదికేసి తరిమాడు. అక్కడ ట్రోజను బలాలను రెండు కక్షలుగా చీలదీసి చిత్రవధ చేశాడు. ఆ యుద్ధంలో ఎలాగో చావు తప్పించుకుని ట్రోయ్‌నగరం చేరినవారు బెదిరిన లేళ్ళలాగా కనిపించారు.

గ్రీకు వీరులందరిలోకీ అగ్రగణ్యుడు వజ్రకాయుడు, ట్రోజనులలో అగ్రగణ్యుడు వీరసింహుడు. కాని వీరిద్దరూ ఇంతవరకు యుద్ధానికి తలపడలేదు, ఇప్పుడు తలపడ్డారు. వారి మధ్య జరిగే పోరు ఎలా పరిణమిస్తుందో, చూడటానికి ఉభయపక్షాల వారూ యుద్ధం నిలిపేశారు.

ఆరంభంలో వీరసింహుడు వజ్రకాయుణ్ణి ఎదిరించటానికి బదులు అతని నుంచి పారిపోసాగాడు. వజ్రకాయుడు అతని వెంటబడి తరమసాగాడు. ఇలా పారిపోవటంలో వీరసింహుడి ఉద్దేశమేమంటే, వజ్రకాయుడు చాలా కాలంగా యుద్ధానికి ఎడంగా ఉన్నందుచేత యుద్ధం చేసే అలవాటు తప్పివుంటుందనీ, తనవెంట పరిగెత్తిస్తే వజ్రకాయుడు త్వరలోనే అలిసిపోయి, ఆ తరవాత తన చేతిలో సులువుగా ఓడిపోతాడనీనూ!



కాని వీరసింహుడి అంచనా తప్పింది. అతను ట్రోయ్ గోడల చుట్టూ మూడు సార్లు పరిగెత్తించినప్పటికీ వజ్రకాయుడికి కొంచెమైనా అలసట రాలేదు. చివరకు వీరసింహుడు పరిగెత్తటం మానేసి, ఎదురు తిరిగి నిలబడ్డాడు. వజ్రకాయుడు అతని మీదికి వస్తూనే అతన్ని గుండెలు దూసుకు పోయేటట్టు పొడిచాడు. వీరసింహుడు కిందపడి ప్రాణాలు విడవబోతూ, తన శరీరాన్ని తనవారికి వప్పగించమని వజ్రకాయుణ్ణి వేడుకున్నాడు.

కాని వజ్రకాయుడు వీరసింహుడి తుది కోరికను లక్ష్యపెట్ట లేదు. అతను వీరసింహుడి కవచాన్ని ఒలిచి తీసుకుని, వీరసింహుడి కాళ్ళను తాళ్లతో తన రథానికి కట్టి, ఆ రథాన్ని తమ నౌకలకేసి తోలుకు వెళ్ళాడు. వీరసింహుడి శవం మట్టిలో కొట్టుకుంటూ రథంవెంట వెళ్లింది.

ఈ విధంగా తన పగ తీరాక వజ్రకాయుడు పితృకీర్తికి అంత్యక్రియలు చేసి, అతని సమాధివద్ద గుర్రాలనూ, పితృకీర్తి వెంట ఉండిన తొమ్మిది వేటకుక్కలలో రెండింటినీ, పన్నెండు మంది ట్రోజను యుద్ధఖైదీలనూ బలి ఇచ్చాడు. ఈవిధంగా బలి అయిన ట్రోజనులలో వర్ధనుడి కుమారులు చాలామంది ఉన్నారు. వీరసింహుడి

శవాన్ని పితృకీర్తి వేటకుక్కలకు వేయాలని కూడా వజ్రకాయుడు ఆలోచించాడు గాని, మళ్ళీ ఆ ప్రయత్నం మానుకున్నాడు.

పితృకీర్తి అంత్యక్రియల సందర్భంలో పోటీపందాలు జరిగాయి. రథాల పోటీలో దేవమయుడు నెగ్గాడు. మల్లయుద్ధంలో రూపధరుడూ, భూధవుడూ సమఉజ్జీలుగా నిర్ణయించబడ్డారు.

ఇంత జరిగినా వజ్రకాయుడి పగ పూర్తిగా చల్లారలేదు. అతను రోజూ తెల్లవారుజామునే లేచి వీరసింహుడి కళేబరాన్ని పితృకీర్తి సమాధి చుట్టూ మూడు సార్లు ఈడ్చేవాడు.

ఒకనాటి రాత్రి చీకటిమాటున, ట్రోయ్ రాజైన వర్ధనుడు గ్రీకు శిబిరానికి వచ్చి, తన కుమారుడి కళేబరాన్ని కొనుక్కునే ఉద్దేశంతో వజ్రకాయుడి గుడారం ప్రవేశించాడు. వర్ధనుడు వచ్చేసరికి వజ్రకాయుడు గాఢనిద్రలో ఉన్నాడు. తలుచుకున్నట్టయితే వర్ధనుడు వజ్రకాయుణ్ణి సులువుగా హత్యచేసి ఉండవచ్చు. కాని వర్ధనుడు ఆ పని చెయ్యక ఎంతో ఉదారంగా ప్రవర్తించాడు.

వజ్రకాయుడు నిద్రలేచాక అతనికీ వర్ధనుడికీ సంప్రతింపులు జరిగాయి. వర్ధనుడు వజ్రకాయుడికి వీరసింహుడి యెత్తు








బంగారం ఇచ్చి అతని కళేబరాన్ని తీసుకునేటట్టు నిర్ణయం జరిగింది. దీనికి ఉభయపక్షాలూ ఆమోదించిన మీదట, గ్రీకులు ట్రోయ్ కోట గోడల వెలపల ఒక కాటా అమర్చారు, ఒకవైపున వీరసింహుడి కళేబరాన్ని పెట్టి రెండో వైపున బంగారం తెచ్చి వెయ్యమన్నారు.

ట్రోజనులు వర్ధనుడి ధనాగారంలో ఉన్న బంగారపు అచ్చులనూ, నగలనూ ఊడ్చితెచ్చి కాటాలో వేశారు. కాని వీరసింహుడి శరీరమే కొద్దిగా మొగ్గుచూపింది. అప్పుడు వర్ధనుడి కుమార్తె ప్రమోదిని తన చేతి కంకణాలను ఊడ్చి కాటాలో వేసింది.

వజ్రకాయుడు అదివరకే ప్రమోదినిని అపారంగా ప్రేమించి ఉన్నాడు. అతనిప్పుడు ఆమె చేసిన పని చూసి, వర్ధనుడికేసి తిరిగి, "నాకు మీ బంగారం ఏమీ వద్దు. ప్రమోదినిని నాకిచ్చి పెళ్లిచేసి, భువనసుందరిని ప్రతాపుడిపరం చెయ్యండి; మనం యుద్ధం మాని సంధి చేసుకునేటట్టు నేను చూస్తాను!" అన్నాడు.

"కావలిస్తే ప్రమోదినిని నువు పెళ్ళాడు. కాని భువనసుందరిని మీకు వప్పగించము. ఇష్టమైతే ఆ ప్రకారం సంధి ఏర్పాటు చెయ్యి!" అన్నాడు వర్ధనుడు.

"ప్రయత్నించి చూస్తాను!" అన్నాడు వజ్రకాయుడు.

వర్ధనుడు వీరసింహుడి కళేబరాన్ని తీసుకుపోయి యథావిధిగా అంత్యక్రియలు జరిపాడు. ఆ సమయంలో ట్రోజనుల రోదన ధ్వని మిన్నుముట్టింది. వీరసింహుడి మరణం వారందరినీ చాలా కలతపెట్టింది.

వజ్రకాయుడు ప్రమోదినిని పెళ్ళాడి యుద్ధాన్ని విరమించే ప్రయత్నానికి పూనుకోవటంలో తన చావును తానే కోరి తెచ్చుకున్నాడు. ఎలాగైనా యుద్ధం నిలిచిపోతుందనే ఉద్దేశంతో ప్రమోదిని ఈ ఏర్పాటుకు ఒప్పుకున్నదేగాని ఆమె వజ్రకాయుణ్ణి





క్షమించలేదు; ఎందుకంటే, అతను తన అన్న అయిన ఇలియుణ్ణి చాలా క్రూరంగా హత్యచేసి ఉన్నాడు.

ప్రమోదిని వజ్రకాయుడిపై ప్రేమ ఉన్నట్టు నటిస్తూ అతని ప్రాణ రహస్యం తెలుసుకున్నది. ఆమెపై ప్రేమకొద్దీ వజ్రకాయుడు తన కుడికాలి మడమలో చావు ఉన్న సంగతి చెప్పేశాడు. అతని శరీరం వజ్రకాయం కాగలందులకు అతని తల్లి అతనిని బాల్యంలో, ఆ మడమ పట్టుకునే నదిలో ముంచింది.

"నీవు సూర్య ఆలయానికి నిరాయుధుడివై పాదరక్షలు లేకుండా వచ్చినట్టయితే అక్కడ సూర్యభగవానుడికి బలులు ఇచ్చి మన పెళ్ళి ఖరారు చేసుకుందాము!" అని ప్రమోదిని వజ్రకాయుడితో చెప్పింది.

వజ్రకాయుడు ఆ ప్రకారమే ఆలయానికి వచ్చాడు. అక్కడ ఆమెవెంట ఆమె ఆప్త బంధువులు కొందరున్నారు. ఆమె అన్న అయిన అరిభయంకరుడు వజ్రకాయుడిపై ఆపేక్ష ఉన్నట్టు నటిస్తూ అతనిని గట్టిగా అలింగనం చేసుకున్నాడు. అదే సమయంలో మోహనుడు విగ్రహం చాటు నుండి వజ్రకాయుడి కుడికాలి మడమను ఒక విషపు బాణంతో కొట్టాడు.



అయినా వజ్రకాయుడు వెంటనే చావ లేదు. ఆలయంలో ఉన్న అగ్నిగుండం నుంచి రెండు కొరవులు చెరొక చేతా తీసుకుని, వాటితో అతను అక్కడి ట్రోజనులను చావమోదాడు. ఆ దెబ్బలకు అనేక మంది ట్రోజనులూ, ఆలయంలో ఉండే పనివాళ్ళూ బలి అయారు.

ఈలోపుగా గ్రీకు శిబిరంలో రూపధరుడు, భూధవుడు మొదలైన యోధులకు వజ్రకాయుడేదో కుట్ర చేస్తున్నట్టు అనుమానం తగిలింది. ప్రమోదినిని పెళ్ళాడి యుద్ధం నిలపటానికి అతను మాట ఇచ్చినట్టు వారెవరూ ఎరగరు. వజ్రకాయుడు సూర్యాల



యానికి ఒంటరిగా బయలుదేరి వెళ్లినట్టు పసికట్టి గ్రీకు యోధులు కుట్ర ఏమిటో తెలుసుకుందామని అక్కడికి వచ్చారు.

వారు ఆలయద్వారంనుంచి లోపలికి వచ్చే సమయంలో మోహనుడూ, అరిభయంకరుడూ ఆ ద్వారంకుండానే బయటికి పోతూ ఎదురయారు. రూపధరుడూ, భూధవుడూ, దేవమయుడూ ఆలయంలోకి వచ్చి కొనప్రాణంతో ఉన్న వజ్రకాయుణ్ణి చూశారు. "ట్రోయ్‌నగరం వశమయాక నా సమాధివద్ద ప్రమోదినిని బలి ఇవ్వండి! ఇదే నా తుది కోరిక!" అంటూ వజ్రకాయుడు తన అనుచరుల చేతులలో ప్రాణాలు వదిలాడు.

మహాబలుడైన భూధవుడు వజ్రకాయుడి శరీరాన్ని తన భుజాన వేసుకున్నాడు. ముగ్గురు యోధులూ ఆలయం వెలపలికి వచ్చారు. వజ్రకాయుడి శవాన్ని ఏవిధంగానైనా సంపాదించటానికి ట్రోజనులు విశ్వప్రయత్నం చేశారు. కాని గ్రీకు వీరులు వారిని తరిమికొట్టి శవాన్ని తమ నౌకల వద్దకు చేర్చారు.

వజ్రకాయుడి తల్లి తటిని దుఃఖానికి అంతులేదు. ఆమెతోబాటు గ్రీకు యోధులందరూ పదిహేడు రోజులపాటు శోకం అనుభవించారు. పద్దెనిమిదో రోజున వజ్రకాయుడి శవాన్ని చితిమీద కాల్చి, అతని అస్తికలనూ, పితృకీర్తి అస్తికలనూ చేర్చి ఒక బంగారు పాత్రలోనే ఉంచి, ట్రోయ్ నగరానికీ సముద్రానికీ మధ్యగా ఒక స్థలంలో సమాధిచేసి, అక్కడ ఒక ఎత్తయిన రాళ్ళ గుట్ట ఏర్పాటుచేశారు. ఈ స్థలానికి సమీపంలోనే ఉన్న గ్రామానికి వజ్రకాయుడి పేరు పెట్టి, ఆ గ్రామంలో అతని పేర ఒక ఆలయం కట్టి, అతని శిలావిగ్రహాన్నికూడా స్థాపించారు. చెవులకు స్త్రీలు ధరించే పోగులు గల ఈ విగ్రహం ఇప్పటికీ అక్కడ ఉన్నది. (ఇంకా వుంది)







# మూగ నోము

పూర్వం యోధపురంలో ప్రతాపుడనే యువకుడుండేవాడు. అతను సామాన్య కుటుంబానికి చెందినవాడు. అయినప్పటికీ అతనికి కత్తియుద్ధంలో గొప్ప నేర్పున్నది. దానికి తోడు అతను అపరిమితమైన ధైర్య సాహసాలుగల యువకుడు. అతను రాజు గారి దగ్గిర కొలువుచేరిన కొద్దికాలానికే తన శౌర్య పరాక్రమాలను ప్రదర్శించి రాజు గారికి ఎంతో ఇష్టుడయాడు. అయితే అతను గొప్పఇంటివాడు కానందువల్లనూ, వయసులో ఇంకా చిన్నవాడు కావటంచేతనూ రాజుగారు తన ఆస్థానంలో ప్రతాపుడికి పెద్ద పదవి ఇవ్వలేదు.

ఆ నగరంలోనే హిరణ్యగుప్తుడనే కోటీశ్వరుడొకాయన ఉన్నాడు. ఆయనకు పార్వతి అనే ఒక కుమార్తె ఉన్నది. ఆమె చాలా చక్కనిది. ప్రతాపుడు ఒకనాడు పార్వతిని చూసి, అదిమొదలు ఆమెమీద ప్రేమ కలిగి నానాటికీ వెర్రివాడులాగా అయిపోసాగాడు. అతను పార్వతితో మాట్లాడాలని ఒకటి రెండుసార్లు ప్రయత్నాలు చేశాడు గాని, కొంచెమైనా ఫలితం లేకపోయింది.

తనకు ఎంతో ఇష్టుడైన ప్రతాపుడు నానాటికీ చిక్కి, పాలిపోతూ ఉండటం గమనించి రాజుగారు కలవరపడ్డాడు. ఆయన తన ఆస్థానవైద్యుణ్ణి పిలిచి, "ప్రతాపుడు ఏదో వ్యాధితో బాధపడుతున్నాడు. వాడి ప్రాణం అమూల్యమైనది. ఎలాగైనా వాడికి చికిత్సచేసి మామూలుమనిషిని చెయ్యి!" అని ఆజ్ఞాపించాడు.

రాజవైద్యుడు ప్రతాపుణ్ణి పరీక్షించాడు, కాని రోగం అంతు చిక్కలేదు. కొద్ది రోజుల పాటు ఏవేవో ఔషధాలుకూడా ఇచ్చి చూశాడు; అవేవీ పని చెయ్యలేదు.

ప్రతాపుడికి అనారోగ్యంగా ఉందని తెలిసి అతని బాల్యమిత్రుడు, సత్యవర్మ అనేవాడు,

ఆర్. మునిరామయ్య





అతన్ని చూడవచ్చాడు. ప్రతాపుడు సత్యవర్మకు నిజం చెప్పేసి, 'మనోవ్యాధికి మందులేదు. పార్వతిని పెళ్లాడితే తప్ప నారోగం కుదరదు. అది సాధ్యమయే పని కాదు. అందుచేత నేను క్రమేణా తీసుకుని చావక తప్పదు! నాకోసం ఎందుకు విచారిస్తావు?" అన్నాడు.

"పిచ్చివాడా! ఈ మాత్రానికే అధైర్యపడతావా? వెళ్లి పార్వతిని కలుసుకుని నీ ప్రేమను ఆవిడకు తెలియజేసుకో! ఆమె నిన్ను పెళ్లాడటానికి ఒప్పుకోవచ్చు. ఒక వేళ ఒప్పుకోకపోయినా నీ కింత మనోవ్యధ ఉండదు!" అన్నాడు సత్యవర్మ.

"అసంభవం! పార్వతి కోటీశ్వరుల బిడ్డ, నేను చూడబోతే నామగోత్రాలు లేని సామాన్య సైనికుణ్ణి. నే నామెను ఎట్లా కలుసుకోగలను, ఎట్లా మాట్లాడగలను! నన్ను ఇట్లాగే చచ్చిపోనీ!" అన్నాడు ప్రతాపుడు విచారంగా.

"నువు చేయలేని పని నీకు నేను చేసి పెడతాను. నువేమీ అధైర్యపడకు!" అని సత్యవర్మ తన స్నేహితుడికి ధైర్యం చెప్పి, వెళ్లిపోయాడు.

అది మొదలు ప్రతాపుడి వ్యాధి తిరుగుముఖం పట్టింది. మూడు నాలుగు రోజులలో అతను మామూలు మనిషి అయినాడు. రాజుగారుకూడా చాలా సంతోషించాడు.

ఈ లోపుగా సత్యవర్మ ఒక వ్యాపారస్థుడి వేషంవేసుకుని ఒక మూటలో అందమైన స్త్రీల సామగ్రి పెట్టుకుని నేరుగా హిరణ్యగుప్తుడి ఇంటికి వెళ్లి పార్వతిని చూశాడు. పార్వతి అతను తెచ్చిన వస్తువులను చూసి చాలా ముచ్చటపడింది. అవి మామూలుగా బజారులో దొరికే వస్తువులు కావు. ఆమె వాటిలో కొన్నిటిని ఏరి, "వీటి వెల ఎంత?" అని అడిగింది.

"వీటిలో మీకు నచ్చినవి ఇవేనా, అమ్మా?" అని అడిగాడు సత్యవర్మ.





"నచ్చటానికేం? నీ దగ్గిర ఉన్న వస్తువులన్నీ నచ్చాయి. కాని అన్నీ ఒకసారి ఎలా కొనేది?" అన్నది పార్వతి.

"నేను తమర్ని డబ్బు అడిగానా, అమ్మా? ఇవి మీకు బహుమానంగా పంపినవాడు వ్యాపారం చేసుకునేవాడు కాడు. మీ రంటే పడిచస్తాడు. మీతో ఒక్కసారి మాట్లాడాలని ప్రయత్నించి, చాతగాక మనోవ్యాధితో మంచం పట్టాడు! వాడి స్థితి చూస్తే మీకు నిజంగా గుండె కరిగిపోతుందన్నమాట!" అని ఇతరు లెవరూ వినకుండా సత్యవర్మ పార్వతితో అనేశాడు.

పార్వతి కొంచెం ఆలోచించి, "ఎవరో పిచ్చివాడులాగున్నాడు. అతనికి కావలిసింది నాతో మాట్లాడటమే అయితే రేపు మధ్యాన్నం ఇక్కడికి రమ్మను, మాట్లాడతాను. ఈ భాగ్యానికే మంచంపట్టాలా?" అన్నది.

ఈ సంగతి తన స్నేహితుడు చెప్పగానే ప్రతాపుడు పరమానందం చెందాడు. మర్నాడు మధ్యాన్నం అతను పార్వతి ఇంటికి వెళ్లాడు. పార్వతి అతన్ని తన గదికి పిలిపించింది. ప్రతాపుడు ఆమెకు తన గొడవంతా చెప్పుకున్నాడు. ప్రతాపుడి మనసు మంచిదే అయినా, అతను తనను ప్రేమించటం కేవలం భ్రమ అనీ, ఏ విధంగానైనా ఆ భ్రమను వదలగొట్టాలనీ ఉద్దేశించి పార్వతి అతనితో ఈ విధంగా అన్నది:

"నీకు నా మీద ఎంతో ప్రేమ ఉన్నదంటున్నావు. ఇదే నిజమైతే ఈ క్షణం నుంచీ ఏడాదిపాటు ఎవరితోనూ ఏ మాత్రమూ మాట్లాడకూడదు. నీవీ పని చేసినట్టయితే నీకు నాపై నిజంగా ప్రేమ ఉన్నదని నాకు నమ్మకం చిక్కుతుంది! అప్పుడు నిన్ను పెళ్లాడతాను!" అన్నది పార్వతి.

ఏడాదిపాటు మూగనోము పట్టటానికి ప్రతాపుడు ఒప్పుకోడనీ, అందువల్ల తాను అతన్ని పెళ్లాడవలిసిన అవసరం కలగదనీ పార్వతి ఉద్దేశం.

పార్వతి కఠినచిత్తురాలనీ, ఆమెకు తన మీద ఏ మాత్రమూ ప్రేమ లేదనీ ప్రతాపుడు గ్రహించాడు. అతనికి ఆమెమీద పట్టరాని కోపం వచ్చింది. అందుచేత అతను, ఏడాదిపాటు మూగనోము పట్టి, ఆమెను పెద్ద చిక్కులో పెట్టటానికి నిశ్చయించుకున్నాడు. మూగనోము షరతుకు తాను సమ్మతించినట్టు సంజ్ఞలతో పార్వతికి తెలియజేసి ప్రతాపుడు వెళ్లిపోయాడు.

అది మొదలు అతను ఎవరితోనూ మాట్లాడలేదు. అతనికి అకస్మాత్తుగా నోరు పడిపోయిందన్న వార్త అంతటా పాకింది. ఈ సంగతి తెలిసి రాజుగారు చాలా బాధపడ్డాడు. ప్రతాపుడికి చచ్చేటంత జబ్బుచేసి నయమయిందని సంతోషిస్తున్న సమయంలో వ్యాధి ఈ రూపాన బయటపడిందని రాజుగారు విచారించాడు. ఆయన దేశంలో ఉన్న వైద్యులందరికీ కబురుచేసి ప్రతాపుడికి తగిన చికిత్స చేయమని ఉత్తరువిచ్చాడు.

ఎందరో వైద్యులు వచ్చి ప్రయత్నించారు, కాని ఒకరూ ప్రతాపుడికి మాట తెప్పించలేక పోయారు. రోజురోజుకీ రాజుగారి ఆందోళన ఎక్కువయింది.

"ప్రతాపుడు యువకుడు. అద్భుతమైన యోధుడు. ఏనాటికైనా సర్వసేనాని





అయి దేశానికి కీర్తి ప్రతిష్ఠలు తీసుకు రాగలవాడు. అతనికి మాట పడిపోవట మేమిటి? ఒక్క వైద్యుడూ చికిత్స చెయ్య లేక పోవటమేమిటి? అతనికి మాట తెప్పించిన వైద్యుడికి లక్ష రూపాయలు బహుమానమిస్తామని చాటించండి!" అని రాజు మంత్రులతో అన్నాడు.

ఆ ప్రకారమే దేశదేశాలా చాటింపు జరి గింది. ఎక్కడెక్కడనుంచో ఘనవైద్యులు వచ్చి ప్రతాపుణ్ణి పరీక్షించి, అతని మూగ తనం పోగొట్టటానికి ఏమీ చెయ్యలేక పోయారు. కాని లక్షరూపాయల ఆశకొద్దీ వైద్యులు కానివాళ్ళుకూడా వచ్చి తమ చికిత్సలతో ప్రతాపుణ్ణి బాధించసాగారు. ఈ సంగతి తెలిసి రాజుగారు, ప్రతాపుడికి చికిత్సచేసి మాట తెప్పించలేకపోయిన వారికి జరిమానా విధిస్తామనీ, జరిమానా ఇచ్చుకోలేకపోతే యావజ్జీవం ఖైదు చేస్తా మనీ మరొక ప్రకటన చేశాడు.

ఆరు నెలలు గడిచాయి. అనేకమంది వైద్యులు అతని మూగతనం పోగొట్టలేక, రాజుగారు విధించిన జరిమానా ఇచ్చుకో లేక ఖైదులో పడ్డారు. ఈ వార్తలన్నీ ఎప్పటికప్పుడు పార్వతికి తెలుస్తూనే ఉన్నాయి. ఆమెకు మొదట ఆశ్చర్యం చాలా వేసింది. ఎందుకంటే ప్రతాపుడు





ఈ మూగనోము చివరంటా నిలబెట్టుకుంటా డని ఆమె ఏనాడూ అనుకోలేదు. తరవాత ఆమెకు ప్రతాపుడిమీద జాలి కలిగింది. అతను ఎందుకు మాట్లాడటంలేదో తనకు తప్ప ఇంకెవరికీ తెలియదు. వైద్యులంతా వచ్చి అతన్ని బాధిస్తున్నారు. రాజుగారు ఏర్పాటుచేసిన నియమం ప్రకారం మంచి వైద్యులుకూడా ఖైదులో పడ్డారు. కోతి పుండు బ్రహ్మరాకసి అయినట్టయింది.

ప్రతాపుడి విషయంలో రాజుగారు చూపించే శ్రద్ధకూడా పార్వతికి ఆశ్చర్యం కలిగించింది. అతను సామాన్య సైనికు డనుకున్నదిగాని, రాజుగారికి అతనంటే ఇంత ఇష్టమని పార్వతి ఎరగనే ఎరగదు. ఈ విషమ పరిస్థితి అంతా తనమూలానే ఏర్పడింది గనక, ప్రతాపుడి మూగనోముకు తన చేతిమీదుగానే ఉద్యాపన అయితే బాగుంటుందని ఆమె అనుకున్నది.

అందుచేత పార్వతి రాజుగారి దర్శనం చేసుకుని, "మహారాజా, నాకు అనుమతి ఇప్పించండి, ప్రతాపుడికి నేను చికిత్స చేసి మాట తెప్పిస్తాను!" అన్నది.

రాజు ఆశ్చర్యపడి, "నీవా? ఎంతో గొప్ప వైద్యులు చేయలేని పని నీవల్ల ఏమవుతుంది? నీకు వైద్యం ఏం తెలుసు?" అని అడిగాడు.

"నాకు వైద్యం తెలియని మాట నిజమే గాని, అతనికి మాటపడిపోయిన కారణం తెలుసు. అందుచేత నేను అతనికి మాట తెప్పించగలను. చికిత్స చెయ్యటానికి నాకు అనుజ్ఞ ఇప్పించండి!" అన్నది పార్వతి.

"చికిత్స చెయ్యలేకపోతే జరిమానా ఇచ్చుకోవాలి! ఆ సంగతి ఎరుగుదువా?" అన్నాడు రాజు.

"చిత్తం! ఆ నియమానికి లోబడే చికిత్స చేస్తాను!" అన్నది పార్వతి.

రాజుగారి అనుమతి పొంది ఆమె ప్రతాపుడి వద్దకు వెళ్ళింది.



"నేను నీకు చాలా అపచారం చేశాను! అరు మాసాలపాటు మూగగా ఉన్నావు. ఇక చాలు! మామూలుగా మాట్లాడు. నేను నిన్ను వివాహం చేసుకోవటానికి సిద్ధంగా ఉన్నాను!" అన్న దామె ప్రతాపుడితో.

ప్రతాపుడి కింకా ఆమెమీద గల కోపం తగ్గలేదు. "ఈ దుర్మార్గురాలు సంవత్సరం గడువులోపల నాచేత మాట్లాడించి నియమ భంగం చెయ్యటానికీ, రాజుగారిచ్చే లక్ష రూపాయలూ కాజెయ్యటానికీ ఈ ఎత్తు వేసింది! ఈమెకు తగిన శాస్తి చేస్తాను!" అనుకుని అతను జవాబు చెప్పలేదు. ఆమె చెప్పే ప్రతి మాటకూ, "మాట్లాడ లేను!" అన్నట్టు సంజ్ఞచేశాడు.

పార్వతి అతన్ని బతిమాలింది, కంట నీరుకూడా పెట్టుకున్నది. కాని ప్రతాపుడు మాట్లాడ నిరాకరించాడు. పార్వతి నిరుత్సాహంతో తల వంచుకుని రాజుగారిదగ్గరకు తిరిగివెళ్లి, "మహారాజా, నా చికిత్స వృథా అయింది! ప్రకటించిన ప్రకారం నాకు తగిన శిక్ష విధించండి!" అన్నది.

పార్వతిని వెంటనే ఖైదులో ఉంచి ఆమె తండ్రికి కబురు పంపారు. ఆమె తండ్రి వచ్చి జరిమానా చెల్లించి తన కుమార్తెను ఇంటికి తీసుకు పోయాడు.



ఇది వినగానే ప్రతాపుడి మంట చల్లారింది. పార్వతికి తగిన శాస్తి అయిందనుకున్నాడు. ఇక తాను మూగనోము చాలించవచ్చు. ఎందుచేతనంటే తనమీద ప్రేమ లేనిదాన్ని పెళ్లాడటం ప్రతాపుడికి ఎంత మాత్రం ఇష్టంలేదు.

ప్రతాపుడు నేరుగా రాజుగారిదగ్గిరికి వెళ్లి తాను మూగగా నటించినందుకు క్షమాపణ చెప్పుకుని దానికంతకూ గల కారణంకూడా చెప్పాడు. రాజుగారు అంతా విని ఆశ్చర్యపడి పార్వతిని పిలిపించాడు.

ఆమెతో రాజుగారు, "ఒక చిన్న పొరపాటు జరిగింది. నువు ప్రతాపుడికి చేసిన

చికిత్స వృథా అయిందనుకుని నీకు జరిమానా విధించాం. కాని తరువాత విచారించగా ప్రతాపుడికి మాట వచ్చినట్టూ, నీ చికిత్స పనిచేసినట్టూ, తెలిసింది. అందుచేత నీ జరిమానా నీకు తిరిగి ఇచ్చి, ప్రతాపుడికి మాట తెప్పించి నందుకుగాను, నీకు లక్షరూపాయల బహుమానంకూడా ఇవ్వ నిశ్చయించాం; పట్టుకు పో!" అన్నాడు.

పార్వతి ఈ మాట విని సంతోషించినట్టు కనబడ లేదు.

"మహారాజా, నేను బహుమానానికి ఆశించి అతనికి చికిత్స చెయ్యలేదు. నేనతనికి గొప్ప ద్రోహంచేశాను. ఆ తప్పు దిద్దుకుందామని ప్రయత్నించాను. ఒకప్పుడు అతను నన్ను ఎంతో ప్రేమించాడు. ఆ ప్రేమను ఇప్పుడు పోగొట్టుకున్నాను. నాకు అదే శిక్ష! అతనికి నామీద ఇంకా ప్రేమ ఉంటే నేను మాట్లాడమని ప్రార్థించినప్పుడే మాట్లాడి ఉండేవాడు. నా చికిత్స వృథా అయిన మాటే నిజం. నాకు తమరేమీ బహుమానం ఇవ్వ నక్కరలేదు!" అన్నది పార్వతి రాజుగారితో.

పార్వతి ఇప్పుడు ప్రతాపుణ్ణి ప్రేమిస్తున్నదని రాజుగారు గ్రహించాడు. అతను ప్రతాపుణ్ణికూడా పిలిపించి, "మీ రిద్దరూ మూగగా ఒకరికోసరం ఒకరు బాధపడటం నా కేమీ బాగాలేదు. ఇంతటితోనైనా మీ మూగనోము చాలించి వెంటనే పెళ్ళాడి, సుఖపడండి!" అన్నాడు.

ఆ ఒక్క మాటతో పార్వతి కష్టాలూ, ప్రతాపుడి కష్టాలూ గట్టెక్కాయి. వారిద్దరికీ త్వరలోనే వైభవంగా వివాహం జరిగింది. రాజుగారు వధూవరులకు విలువైన అనేక బహుమానాలు ఇస్తూ లక్షరూపాయలు కట్నంకూడా చదివించాడు.

ప్రతాపుడు రాజుగారి కొలువులో పెద్ద ఉద్యోగి అయి, కాలక్రమాన సేనాధిపతి పదవికూడా సంపాదించుకున్నాడు.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1957 మే సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మార్చి 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : సాధనమున పనులు....

రెండవ ఫోటో : సమకూరు ధరలోన!

పంపినవారు : డి. దేవసహాయం, H. M., హైయర్ ఎలిమెంటరీస్కూలు, మోళ్లగుంట, మృత్యుంజయపాలెం P. O., రేపల్లెతాలూకా, (గుంటూరు జిల్లా.)

బహుమతిమొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.



# రాబందు రభస

[గత సంచిక తరువాయి]

కొద్ది సేపటికల్లా ఒక రాబందు అటుగా వచ్చి నేలమీద స్పృహ తప్పి పడి ఉన్న నక్కను చూసి, "అయ్యో, పాపం! నక్క బావగారికి నూకలు చెల్లాయా?" అన్నది.

నక్క చటుక్కున లేచికూచుంటూ, "ఈ కుందేలు భరతం పట్టించందీ నేను చస్తానా?" అన్నది.

"కుందేలా?" అన్నది రాబందు.

"ఈ చెట్టు తొర్రలో దూరిందిలే. ఎక్కడికి పోతుంది? చూడు, రాబందన్నా! నువు ఈ తొర్రదగ్గిర కాస్త కాపుంటివా, నే నింటికి వెళ్ళి గొడ్డలితెచ్చుకుంటాను," అన్నదినక్క.

"ఓ, అలాగే ఉంటాను. వెళ్ళిరా!" అన్నది రాబందు, నక్క వెళ్ళిపోయింది.

తొర్రలో దాగి ఉన్న కుందేలు నక్క వెళ్ళిపోయిన కాస్సేపటికి, "నక్కబావా? నక్కబావా!" అని పిలిచింది.

రాబందు, కొంచెంసేపు ఆగి "ఏం?" అని నక్క గొంతుతో అన్నది.

"ఈ తొర్రలో పోతంత పందికొక్కు! రాబందన్న ఉంటే ఎంత బాగుణ్ణు!"

"రాబందన్న ఇక్కడే ఉన్నాడు. పంది కొక్కును బయటికి తరుము," అన్నది రాబందు ఆశగా.

"ఇటువేపు నేను అడ్డం ఉన్నాను. అటు వేపు తొర్రదగ్గిరికి రాబందన్నను రమ్మను, తరుముతాను!" అన్నది కుందేలు. రాబందు చెట్టు అవతలివేపుకు బయలుదేరింది.

"హెయ్! ఛీ! టుర్!" అని కుందేలు చప్పుళ్ళుచేసి, తొర్రలోనుంచి తొంగి చూసింది. రాబందు చెట్టు వెనక్కి వెళ్ళగానే బయటికి వచ్చి శరవేగంతో పరిగెత్తి, కొంప చేరుకున్నది.

కుందేలు తప్పించుకు పోయిందని రాబందు గ్రహించింది.

టి. శంభుదాసు

"నేను ఒక్కట్టే ఎందుకు మోస పోవాలి? నక్కను కాస్సేపు ఏడిపించి మరీ పోతాను!" అనుకుని రాబందు అక్కడే కూచుంది.

ఇంతలో నక్క గొడ్డలి భుజాన పెట్టుకుని రానే వచ్చి, "కుందేలు ఏమంటున్నది?" అన్నది.

"చడీ చప్పుడూ లేదు. నిద్ర పోతున్నది లాగుంది!" అన్నది రాబందు.

"నిద్ర లేపుదాం!" అంటూ నక్క గొడ్డలితో చెట్టును నరక సాగింది.

పది దెబ్బలువేసి నక్క అలిసిపోయింది. గొడ్డలి నేలమీద ఆనించి రొప్పుతూ నక్క, రాబందు తనలోతాను నవ్వుకుంటూ ఉండటం గమనించి, మోసం తెలుసుకున్నది. అది రాబందుకేసి కొరకొరా చూస్తూ, "కుందేలు తొర్రలో ఉన్నట్టేనా?" అని అడిగింది కోపంగా.

"అవును, నక్కబావా! నీ తోడు!" అన్నది రాబందు.

నక్క తొర్రలోకి చూసి, "అ కనిపించేది దాని కాలేనా, చూడు!" అన్నది.

రాబందు తొర్రలోకి మెడ పెట్టింది. వెంటనే నక్క దాని మెడ పట్టేసుకుని, "భడవా! నువుకూడా నన్ను మోస పుచ్చుతావుగా? చూడు నిన్నేం చేస్తానో!" అన్నది.

"వదులు, నక్కబావా! నన్నెందుకు పట్టుకున్నావు?" అన్నది రాబందు.

"ఎందుకా! నిన్ను తొర్రదగ్గిర కాపలా పెట్టాను. కుందేలు తప్పించుకు పోయింది! ఈ అడివిలో ప్రతి వెధవా నన్ను మోసం చేస్తే నన్నింకెవరన్నా లక్ష్య పెడతారా! చావు!" అంటూ నక్క రాబందును తోక పట్టుకుని నేలకేసి బలంగా కొట్టబోయింది. రాబందుతోక ఈకలు నాలుగు ఊడి నక్క చేతిలోకి వచ్చాయి. రాబందు ఎగిరిపోతూ, "నీ తెలివి అడుక్కు తిన్నట్టే ఉంది!" అని నక్కను వేళాకోళం చేసిపోయింది.

(ఇంకా వుంది)






ప్రొఫెసర్ పి. సి. సర్కార్

"దివ్యదృష్టి" ప్రదర్శించటంలో ఒక కొత్త పద్ధతి చూపటానికి ఈ ట్రిక్కు పనికి వస్తుంది. ఇంద్రజాలికుడి కళ్లకు దళమైన గంత కట్టేస్తారు. అతను ఆ గంత కట్టుకుని ఏమీ చూడలేడు. తరువాత రెండు డజన్ల మామూలు పెనసళ్లు వేరువేరు రంగులవి, కొయ్యవి, తెస్తారు. వాటిలో ఒకదాని రంగు ఇంకొకదానికుండదు. ఒకదాని ఆకారం మరొకదానికుండదు. వాటన్నిటినీ బాగా కలిపివేస్తే ఏ పెనసలు ఎక్కడ తయారయిందీ—జపానుదా, బవేరియాదా, అమెరికాదా, మద్రాసుదా, బొంబాయిదా, కలకత్తాదా, ఢిల్లీదా—ఎవరూ చెప్పలేరు. పెనసలుమీది అక్షరాలను దగ్గిరిగా చూస్తేనేగాని ఆ వివరాలు తెలియవు. ఈ పెనసళ్ల నన్నిటినీ ఒక టోపీలోవేసి బాగా కలిపేస్తారు. వీటి నుంచి ప్రేక్షకులలో ఎవరో ఒకరు ఏదో ఒక పెనసలును తీసుకుంటారు. ఆ ప్రేక్షకుడు దాని వివరాలు తెలుసుకుని మరొక ప్రేక్షకుడికి అందజేస్తాడు. ఈ విధంగా అనేకమంది ప్రేక్షకులు ఆ పెనసలు రంగూ, అది తయారైన దేశమూ, ఇతర గుర్తులూ గమనించినాక, దాన్ని మళ్లీ టోపీలోవేసి మిగిలిన పెనసళ్లతో బాగా కలిపేస్తారు. అప్పుడు టోపీ ఇంద్రజాలికుడికి అందజేస్తారు. అతను ఆ టోపీనుంచి ప్రేక్షకులు తీసిన పెనసలును తీయగలుగుతాడు. పొరపాటున తన చేతికి తప్పుడు పెనసళ్లు వచ్చినట్టయితే, "ఇదికాదు, ఇదికాదు!" అని చెప్పగలుగుతాడు.

ఈ ట్రిక్కులోని రహస్యం సులువైనది. ఇంద్రజాలికుడి అసిస్టెంటులలో ఒకడు ముందుగానే ప్రేక్షకులలో

ఉంటాడు. ప్రేక్షకులు పెనసలును పరీక్షించినమీదట తానుకూడా వారిలో ఒకడుగా పరీక్ష చెయ్యటానికిలాగా పెనసలును తీసుకుని తన చేత్తోనే టోపీలో దానిని వేసేస్తాడు. అలాచేసే ముందు అతను తన చేతిలో దాచి ఉంచిన కోల్డ్ క్రీమ్ కొంచెం తీసి పెనసలు కొసని రుద్దుతాడు. పెనసల్ల కొసలు తడివి చూసేటప్పుడు ఐంద్రజాలికుడు ఆ పెనసలును సులువుగా కనిపెట్టగలుగుతాడు. నేనీ ట్రిక్కును ఒకసారి "చూయింగ్ గమ్" ముద్ద సహాయంతో చేశాను. ఇదే విధంగా మైనాన్నికూడా ఉపయోగించవచ్చు. ప్రేక్షకులలో ఉండే అసిస్టెంటు తన చేతి రుమాలులో ఒక చిన్న మంచు ముక్కను దాచగలిగినట్టయితే అతను పెనసలు కొసను చల్లగాచేసి టోపీలో వేయవచ్చు. ఐంద్రజాలికుడు చల్లదనాన్ని బట్టి అసలు పెనసలును పోల్చుకుంటాడు.




[పాఠకులు, యీ గారడీని గురించి మరే వైనా సలహాలు పొందదలిస్తే: ప్రొఫెసర్: పి. సి. సర్కార్, మెజిషియన్, బాలీగంజ్, కలకత్తా - 19.]



# వార్తలు-విశేషాలు

నాసిక్ జిల్లాలోని సర్నెఅవన్ గ్రామంలో మన్సాకాలూ అనే రైతున్నాడు. అతడు నిటారుగా నిలబడితే ఏడు అడుగుల ఆరంగుళాల ఎత్తు. పది అడుగులవరకూ ఇంకా పెరగవచ్చునని నాసిక్ సివిల్‌సర్జను అభిప్రాయం. ఇండియాలోకెల్లా ఈ రైతే పొడగరి, మహాకాయుడు అంటున్నారు.

*   *   *   *

ఒక బ్రిటిష్‌కంపెనీ; ప్రపంచంలోకెల్లా అత్యంత నిర్దుష్టంగా పనిచేసే గడియారాలను ఉత్పత్తి చేస్తున్నది. ఈ గడియారానికి అమెరికా, జపాన్, హాలెండ్, బెల్జియం, స్విట్జర్లెండు దేశాలు ఆర్డర్లు ఇచ్చాయి. మన ఇండియాకూడా ఆర్డరిచ్చింది. ఈ గడియారం సూచించే కాలంలో నూరు సంవత్సరాలమీద ఒక్క సెకనుకంటె వ్యత్యాసం ఉండదట!

*   *   *   *

గుంటూరుజిల్లాలోని మాచెర్లతాలూకాలో, రెండు పెద్ద సున్నపురాతి గనులున్నట్టు కనుగొనబడినవి. ఈ రెంటినుంచి సుమారు 12 కోట్ల 40 లక్షల సున్నపురాయి లభ్యంకాగలదని, భారతప్రభుత్వ భూగర్భశాఖ ప్రకటించింది.

*   *   *   *

వజ్రంకంటే కఠినమైన ఒక వస్తువును అమెరికన్ వైజ్ఞానికులు సృష్టిస్తున్నట్టు తెలుస్తున్నది. దీనికి 'బొరేజన్' అని పేరు. వజ్రం 1600 సెంటిగ్రేడ్‌ల ఉష్ణోగ్రతకే కరిగిపోతుంది. కాని బొరేజన్ మాత్రం 3500 సెంటిగ్రేడ్‌ల ఉష్ణోగ్రతకుకూడా చెక్కుచెదరదని చెబుతున్నారు.



గుంటూరు, నెల్లూరు జిల్లాలలో రెండు పెద్ద యినుము గనులు బయటపడినవి. వాటిలో సుమారు 39 కోట్ల టన్నులవరకు ముడియినుము లభించగలదని ఇండియా భూగర్భ పరిశోధన శాఖవారు ప్రకటించారు.

*　　*　　*　　*

ఇటీవల హైదరాబాద్ బిపబ్లిక్‌గ్రౌండ్సులో ఫల, పుష్ప ప్రదర్శనలు ఏర్పాటు చేయబడినై. ఉత్తమమైనవాటికి బహుమతు లివ్వబడినై. ఆంధ్రలో ఏటా 12 కోట్ల రూపాయల విలువగల పండ్లు పండుతున్నవనీ, 2 కోట్ల రూపాయిల విలువగల పండ్లు ఎగుమతి చేయబడుతున్నవనీ వ్యవసాయశాఖ డైరెక్టరు చెప్పారు.

*　　*　　*　　*

ఏప్రిలు 1-వ తేదీనుంచి మన దేశంలో అమలుకు రాబోతున్న దశాంశ నాణెముల పద్ధతిని గురించి కేంద్రమంత్రి శ్రీ గుహా కొన్ని వివరాలు చెబుతున్నారు: 'ఈ పద్ధతికి ప్రాతిపదిక ఐన సున్నను ఏనాడో కనిపెట్టింది మనదేశం. కాని దీనిని వినియోగించుకోలేదు. స్వాతంత్ర్యం వచ్చాక ఈ విషయమై భారతప్రభుత్వం శ్రద్ధ వహించింది. ఇది తక్కిన పద్ధతులకంటె చాలా ఉపయోగకరమైనది. దీన్ని అమల్లో పెట్టడం ప్రజల కెంతో లాభదాయకం.

*　　*　　*　　*

కొలంబో ప్రణాళికక్రింద ఇండియాకు ఆస్ట్రేలియానుంచి 2000 వాగన్లు, 25 డీసెల్‌కార్లు దిగుమతి కాబోతున్నాయి. 1957-58 లో ఇవి ఇండియాకు అందజేయబడతాయని తెలుస్తున్నది. ఈ సంవత్సరం దిగుమతి కాబోయే ఈ పరికరాల విలువ 5 లకల 40 వేల రూపాయలు.

*　　*　　*　　*

విద్యార్థులకు లోకజ్ఞానం కల్గించడానికి ఉపకరించే సాధారణవిద్యకు సంబంధించిన కోర్సులను ఏదో ఒక రూపంలో ఈ యేడు ప్రవేశపెట్టటానికి మద్రాసు, ఉస్మానియా, తిరువాన్కూరు విశ్వవిద్యాలయాలతో సహా 11 యూనివర్సిటీలు నిశ్చయించాయి.



# చిత్రకథ





ఒక రోజున దాసూ, వాసూలు 'టైగర్'ను వెంటబెట్టుకుని బయలుదేరారు. పొలంలో వారికి ఒక కుర్రాడు కనిపించాడు. వాడిదగ్గిర 'టైగర్' కన్న పదింత లున్న కుక్క ఒకటి వుంది. దాన్ని 'టైగర్' మీద పరుగు పందెం వేస్తా నన్నాడు. దాసూ, వాసూలు ఒప్పుకున్నారు. పెద్దకుక్క పరుగు ప్రారంభించ గానే, 'టైగర్' దాని తోక పట్టుకున్నది. చేరవలసిన చెట్టును పెద్దకుక్క సమీ పించేంతలో, 'టైగర్' దాని తోక వదిలి, ఒక్క ఎగురున ముందుకు దూకి పరి గెత్తింది. దానితో, గెలుపు 'టైగర్' దేనని ఆ కొత్త కుర్రాడు ఒప్పుకోక తప్పలేదు.





Printed by B. NAGI REDDI at the B. N. K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26—Controlling Editor: SRI 'CHAKRAPANI'

# క్రొత్తదానిలా ఉంది!



## తాతావారి 501 స్పెషల్

## సబ్బుతో ఉతకబడినది




మీ నాజూకైన చీరలు క్రొత్తవాటివలె చాల కాలము ఉండాలనుకుంటారా? అయితే వానికి ప్రత్యేకమైన జాగ్రత్త తీసుకోండి. వానిని తాతావారి 501 స్పెషల్ సబ్బుతోనే ఉతకండి. ఈ శుద్ధమైన సబ్బుతో మీ బట్టలను తేలికగా, పొదుపుగా ఉతుకుకోవచ్చును.

నూటికి నూరు పాళ్లు భారతీయ

- పెట్టుబడి
- నిర్వహణ
- పనివాళ్ల పాటు







కె. టి. డోంగ్రే & కంపెనీ,
(ప్రైవేట్) లిమిటెడ్,
బొంబాయి - 4

# రవి టాయ్‌లెట్సును వాడండి

## రవి గ్లిసరిన్ సోపు:
మీ అందమును వర్చస్సును కాపాడును.

## రవి వెజిటబుల్ హేరాయిల్:
మీ కేశములను విరివిగా పెంపొందించును.

## రవి స్నో:
మీ ముఖవిలాసమును అభివృద్ధి చేయును.




సోల్ ఏజంట్లు:
ది న్యూ స్టార్ & కంపెని,
తండియార్పేట :: మద్రాసు-21

Photo by T. S. Satyan



బహుమతి
పొందిన వ్యాఖ్య

సమకూరు ధరలోన!

పంపినవారు :
డి. దేవసహాయం - మోళ్లగుంట

